# ఆంధ్రపత్రిక

317382



The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 18 TUESDAY 19th APRIL 1949 వెల ఒకఅణా { Founder: K. Nageswara Rao

# సర్వస్వతంత్ర రిపబ్లిక్‌గా దక్షిణ ఐర్లెండ్ అవతరణ

## గోదావరి ఉత్తరకాలువ ప్రాజెక్టు: 12½ లక్షల ఎకరాల సాగుకు హైద్రాబాద్ ప్రభుత్వ స్కీము

హైదరాబాద్, ఏప్రిల్ 17: గోదావరినదినుండి నీరు పంపుచేయుటకు గోదావరి ఉత్తర కాలువ ప్రాజెక్టును నిర్మించుటకు హైదరాబాదు ప్రభుత్వం 9 కోట్ల 28 లక్షల రూపాయలను మంజూరు చేసింది. గోదావరి ఉపనది కద్దాం అను నదిమీద, డాము నిర్మించుట, 79 మైళ్ల పొడవుగల కాలువను త్రవ్వుట, పంపింగు మిషన్లను ఏర్పాటుచేయుట యీ ప్రణాళికలోని భాగాలు. ఈ ప్రాజెక్టు వలన 12,50,000 యకరాలు సాగులోకి రాగలవని అంచనా వెయ్యబడింది. ఇది గోదావరిలోయ అభివృద్ధికి మొదటి మెట్టు. మొత్తం లోయ అభివృద్ధికి దాదాపు 75 కోట్ల రూపాయలగును.

## దక్షిణ ఆఫ్రికా భారతీయులపై ఆఫ్రికన్లు తిరిగి విజృంభించే ప్రమాదం

### డర్బన్ కల్లోలాల విచారణ సంఘ హెచ్చరిక

### "వెనుకటి హత్యలకు యూరపియన్ల ప్రోత్సాహం ఉన్నమాట నిజమే"

కేప్‌టౌన్, ఏప్రిల్ 17: జనవరిలో డర్బాన్‌లో జరిగిన ఆఫ్రికన్-భారతీయజాతి కలహముపై విచారణజరుపుటకు దక్షిణాఫ్రికా ప్రభుత్వం నియమించిన సంఘం నేడు తమనివేదికను ప్రకటిస్తూ ఆఫ్రికన్లు పగసాధించుటకు భారతీయులపై తిరిగి దాడిచేయవచ్చునని హెచ్చరించినది. పరిస్థితులను జాగ్రత్తగా కనిపెట్టి దౌర్జన్య ధోరణులను నిర్దాక్షిణ్యంగా అణచకపోతే ఆఫ్రికన్లు తిరిగి దాడిచేయగలరని ఆ నివేదిక హెచ్చరించినది. అందులోను కిందటిసారి కలహాలు రేగిన డర్బాన్‌నగరంలో మరీ జాగ్రత్తగా ఉండవలెనని విచారణ సంఘం ఉద్ఘాటించినది.

భారతీయులపై దౌర్జన్యం జరపవలసినదిగా కొందరు యూరపియన్లు ఆఫ్రికన్లను రెచ్చగొట్టినమాట నిజమేనని విచారణ సంఘం ప్రకటించినది. అయితే అటువంటి వారు చాలా స్వల్పంగానే ఉన్నారని వెల్లడించినది.

రెండురోజుల కలహాలలోను 142 మంది మరణించారనీ, 1087 మంది గాయపడ్డారని వీరి నివేదిక తెలియజేస్తున్నది.

నివేదికలో ఈ కింది ఇతర అంశాలున్నవి:

కలహాలు జరగడం అధికారులకే ఆశ్చర్యాన్ని కలిగించినది. కాబట్టి ముందే వాటిని వారు నివారించలేదనటం సబబు కాదు.

### కలహ కారణాలు

(1) డర్బాన్‌లోని ఇక్కట్లు కలహానికి ఒక ముఖ్యకారణం. అక్కడ దరిద్రపు కొంపల్లో మందలుగా నివసిస్తున్న ఆఫ్రికన్ల దుస్థితి చెప్పనలవికాదు. దానితో వారు రెచ్చిపోయినారు.

(2) ఆఫ్రికన్లతోపాటుగా పేదభారతీయులకుకూడా ధనిక భారతీయులమీద తీవ్ర విద్వేషం ఉన్నది.

(3) దక్షిణాఫ్రికాలో 'జాతి విద్వేషం' చూపబడుతున్నదని విదేశ పత్రికలు, వాటినిచూసి కొన్ని దక్షిణాఫ్రికా పత్రికలు వ్రాసిన వ్రాతలు విద్వేషంలేని ఆఫ్రికన్లను రెచ్చగొట్టినవి. కాని నిజానికి దక్షిణాఫ్రికాలో అవలంబించబడుతున్న 'రంగు తేడాయింపు' పద్ధతికి ఆఫ్రికన్లు సుముఖులే.

(4) పోలీసులు సంఘర్షణను ప్రోత్సహించారన్నది నిరాధారమైన ఆరోపణ. భారతీయ సాక్షులు నిరాధారమయిన పత్రికల వార్తలమీద ఆధారపడి ఈ ఆరోపణలు చేశారు.

(5) ఆఫ్రికన్లను తమలో కలుపుకొని తెల్లవారితో కలహం పెంచాలన్న ఉద్దేశంతో కొందరు భారతీయులు వారిలో విష ప్రచారం చేశారు. ఆదినారికే [illegible] కొట్టింది.

(6) భారతీయుల్లో కొందరు ఆఫ్రికన్ల సంఘను నిరసించటం మొదలు పెట్టారు. మరి కొందరు న్యాయం [illegible] వారిని బాధించుకున్నారు.

## బ్రిటిష్ సింహాసనంతో గల ఆఖరు బంధ విచ్ఛేదనం

### కాసిల్లో ప్రభుత్వం జరిపిన స్వాతంత్ర్యఉత్సవాల్లో డీవెలరాపక్షం పాల్గొనలేదు

డబ్లిన్, ఏప్రిల్ 18: ఆదివారం అర్ధరాత్రి (తెల్లవారితే సోమవారం అనగా) దాటినవిమ్మట సరిగా ఒకేఒక నిమిషానికి "ఐర్" (దక్షిణ ఐర్లెండు) బ్రిటిష్‌కామన్వెల్తుతో వున్న సంబంధాన్ని పూర్తిగా తెగతెంపులు జేసుకొని సర్వస్వతంత్ర ప్రజాస్వామ్య ప్రతిపత్తిగల 'రిపబ్లిక్'గా అవతరించినది.

ఇప్పటికి దాదాపు ఏడు శతాబ్దాలగా ఐరిష్ ప్రజలు సాగిస్తున్న ఐరిష్ స్వాతంత్ర్య సమరానికి నేటిరాత్రి జరిగిన చరిత్రాత్మక సంఘటనతో శుభాంతము చేకూరినది. ఈ శుభసమయాన్ని పురస్కరించుకొని దక్షిణ ఐర్లెండు రాజధాని డబ్లిన్ నగరంలోని ప్రభుత్వ భవనం వద్ద 21 సార్లు ఫిరంగులు కాల్చి వేడుక జరిపారు. క్రైస్తవ దేవాలయా లన్నిటిలో హర్షసూచకంగా ఘంటానినాదాలు జరిగినవి.

ఈ ఉత్సవంలో నేడు అనేక లక్షలమంది పాల్గొన్నారు.

అర్ధరాత్రి కాగానే, 1916 లో ఈస్టరు సోమవారంనాడు డబ్లినులో సాగిన తిరుగుబాటుయొక్క 33 వ వార్షిక దిన మారంభమయినది. దానితోబాటు ఐర్లండు రిపబ్లికు చట్టం అమలులోకి వచ్చింది. చర్చి గంటలతో కలిసి ప్రజల కోలాహలం మిన్నుముట్టింది.

నేటి ఉదయం ఐరుకుచెందిన 26 కౌంటీలలోని చర్చిలలోనూ ఆరాధనలు జరిగినవి. డబ్లినులో అధ్యక్షుడు సియాన్ ఓకెల్లీ సైనికుల జోహార్లు అందుకొన్నాడు.

ఈ ఉత్సవాలను మిస్టర్ డివెలెరా పక్షంవారు నిషేధించారు. అయినా డబ్లినుపట్టణంలోకి ఐరు ప్రజలూ, విదేశీయులూ అసంఖ్యాకులుగా చేరారు. ప్రపంచమంతటినుంచీ అధ్యక్షుడికి అభినందన సందేశాలు వచ్చినవి.

ఉత్తర ఐర్లండులో కారిక్ మోర్ అనే గ్రామంలో నిన్న సమావేశమైన 500 మంది యువకులను ఊరేగవద్దని పోలీసులు హెచ్చరించారు. అయినా వారు లక్ష్యంచేయక ఒక పొలంలోకి వెళ్లి రిపబ్లికుపక్షానికి చెందిన "సిపాయిపాట" పాడుతూ రిపబ్లికు జెండా ఎగరవేయగా పోలీసులు కర్రలతో వారిని పారదోలారు. అనేక మందికి గాయాలు తగిలినవి.

### అధ్యక్షుడు ట్రూమన్

ఐరు అధ్యక్షుడు సియాన్. ఓకెల్లీకి అమెరికా అధ్యక్షుడు ట్రూమన్ ఈ విధంగా సందేశం పంపాడు:

"మీ దేశముయొక్క సౌభాగ్య సంపదలు నిరంతరాభివృద్ధి చెందవలెనని అమెరికా ప్రజలతరఫున శుభాకాంక్షలు మీకును, ఐరిషు ప్రజలకును పంపుతున్నాను."

### ప్రధాని అట్లీ

బ్రిటిషు ప్రధాని అట్లీ ఈ విధంగా సందేశం పంపాడు:

"ఈ అపూర్వ తరుణంలో బ్రిటను

2వ పేజి చూడుడు

### జార్జిరాజు శుభాకాంక్ష

డబ్లిన్, ఏప్రిల్ 18: జార్జిరాజు ఐరిష్ ప్రభుత్వానికి యీ కింది శుభ సందేశాన్ని పంపాడు.

"ఐర్లెండు రిపబ్లిక్కు ప్రజలకు యునైటెడ్ కింగ్‌డమ్ ప్రజలకు మధ్య ఉన్న సన్నిహితసంబంధములను గుర్తెరిగిన వాడనై నేను యీ దినమున మీకు శుభాకాంక్షలు అందజేయుచున్నాను. గత ప్రపంచ సంగ్రామంలో మన లక్ష్యంకొరకు మీ దేశప్రజలొనరించిన త్యాగాలు ఆ జన్మాంతం నా స్మృతిపథంలో నుండగలవు. భగవదాశీర్వాదం సర్వదా మీకు లభ్యమగుగాక!"

## ఆజాద్ కాశ్మీర్ సేనల భవిష్యత్తు విషయంలో భారతప్రభుత్వ స్థిరవైఖరి

### యుద్ధ విరమణ నూత్న ప్రతిపాదనలపై ఢిల్లీలో మధ్యవర్తి సంఘచర్చల ప్రారంభం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 17: కాశ్మీరులో యుద్ధవిరమణ ఒడంబడిక స్థిరీకరణకై తాము చేసిన ప్రతిపాదనలపై సమితి మధ్యవర్తి సంఘం నేడు భారత ప్రభుత్వంతో కొత్త సంప్రదింపులు ప్రారంభించినది. మధ్యవర్తి సంఘం తరఫున డా॥ ఆల్‌ఫ్రెడొ లొజానో, లెగ్వెజామన్‌లు భారతప్రభుత్వ విదేశాంగశాఖా కార్యదర్శి గిరిజాశంకర్ బాజ్‌పాయ్‌గారిని కలుసుకుని మధ్యవర్తి సంఘంవారు ఈ మధ్య ప్రతిపాదించిన కొత్త సంధి ప్రతిపాదనలను గురించి నేడు చర్చించారు.

ఈ ప్రతిపాదనలకు భారతప్రభుత్వం సమాధానాన్ని సర్ బాజ్‌పాయ్‌గారు రేపు-మధ్యవర్తి సంఘాన్ని తిరిగి కలుసుకున్నప్పుడు అందజేస్తారని తెలుస్తున్నది. ఈ జవాబుతోపాటు, పాకిస్థాన్ సేనలు యుద్ధవిరమణ నియమాలను ఉల్లంఘించినందుకు భారతప్రభుత్వ ఆక్షేపణను కూడా బాజ్‌పాయ్‌గారు మధ్యవర్తి సంఘప్రతినిధులకు ఇస్తారని తెలుస్తున్నది. మధ్యవర్తిసంఘ ప్రతినిధులు నేడిని కలుసుకున్న తరువాత రాకల్పిండికి వెళ్ళి పాకిస్థాన్ ఉద్యోగులతో సంప్రదింపులు.

ఈనాడు జరిగిన చర్చలలో ఆజాద్ కాశ్మీర్ భూభాగంపట్ల కానీ, ఆజాద్ కాశ్మీర్ సైన్యాన్ని రద్దుచేయాలన్న విషయంలోకాని ఇండియా అభిప్రాయంలో మార్పేమీ కనిపించలేదు.

### 300 అడుగుల ఎత్తునుండిపడి మరణం

టెంకాసి, ఏప్రిల్ 17: గోల్డెన్ రాక్‌వద్ద దక్షిణ భారత రైల్వే వర్కుషాపులో పనిచేస్తున్న షేక్ అబ్దుల్ హమీద్ అనునతడు, నిన్న కుర్తాళం కొండమీదనుండి అకస్మాత్తుగా కిందపడి తలబ్రద్దలై వెంటనే మరణించెను. హమీద్ కొంతమంది స్నేహితులతో కలసి ఫోటోలు తీయటానికి కుర్తాళం కొండలమీదికి వెళ్ళెను. కొండపైభాగాన ఫోటో తీస్తుండగా కాలుజారి దాదాపు 300 అడుగుల ఎత్తునుండి కిందపడి తలపగిలి వెంటనే మరణించెను.

## ముందెప్పుడో భారత దేశం దండెత్తునని సింహళభయం

కొలంబో, ఏప్రిల్ 17: కామన్వెల్తు సమావేశంలో పాల్గొనడానికి వెళ్ళనున్న సింహళ ప్రధాని డాన్ స్టీఫెన్ సేనానాయకే, ఇండియా కామన్వెల్తులో ఉండేదీ లేనిదీ సింహళానికి ప్రాముఖ్యం గల విషయమనీ, ప్రస్తుతం ఇండియా సింహళాలకు అనేక విషయాలలో సామరస్యం ఉన్నప్పటికీ ఎన్నటికైనా సింహళాన్ని ఇండియా ఆక్రమించే భయం లేకపోలేదనీ, బ్రిటిషు సింహాసనానికి సింహళం నిశ్చయంగా తలవొగ్గి ఉంటుందనీ, సింహళం కామన్వెల్తులో ఉండడమే కాక, కామన్వెల్తు సభ్యులకు సన్నిహిత సంబంధాలుండడం తన అభిమతమనీ చెప్పాడు.

## చైనా ప్రభుత్వానికి కమ్యూనిస్టుల అంత్యసందేశం

### పీపింగు సంప్రతింపులు ఫలింపగలవని ఇప్పటికీ నాన్కింగు విశ్వాసం

నాన్కింగు, ఏప్రిలు 18: నిన్న ప్రభుత్వప్రతినిధి అయిన హ్వాంగ్‌షావో సీంగ్ ద్వారా పంపబడిన సంధి పథకంలో 8 సూత్రాలున్నూ, 24 నిబంధనలున్నూ ఉన్నట్లు నేటిరాత్రి కమ్యూనిస్టు రేడియో ప్రకటించెను. వీటిని ఆమోదించడానికి ప్రభుత్వానికి 20 వ తేదీవరకూ గడు విధ్వబడెను.

ఈపథకం లోగడ జనవరి 14 న మావో సెటూంగ్ ప్రకటించిన 8 సూత్రాలపై తయారుచేయబడినదట. ఆసూత్రా లేమనగా, సామ్రాజ్యదేశాలతో చేసుకొన్న అపాయకరమైన ఒడంబడికలను ఉపసంహరించుకొనడం; రాజ్యాంగాన్ని రద్దుచేయడం; యుద్ధకారకులను విచారించడం; ప్రభుత్వంలోనూ, సైన్యంలోనూ గల అభివృద్ధి నిరోధకులను తొలగించడం; నిరంకుశుల పెట్టుబడులను జప్తుచేయడం; భూసంస్కరణలు; అభివృద్ధి నిరోధకులు తప్ప మిగిలిన అన్నివర్గాలతో కూడిన శాసనసభ ఏర్పరచడం; కాలెండరు సంస్కరణ.

చింకియాంగుకు ఈశాన్య దిక్కుగా కమ్యూనిస్టువాడిఆరంభమైన కావోచియావో చేన్, లాకొలవద్దనుండి ప్రభుత్వసేనలు ఉపసంహరించబడినవి. ఇదే సమయంలో యాంగ్సీ దక్షిణతీరంపై కమ్యూనిస్టులు ఫిరంగికాల్పులు సాగించారు. కమ్యూనిస్టుల షరతులు ఆమోదించి వారిని శాంతంగా యాంగ్సీ దాటనివ్వడమో, వాటిని నిరాకరించి, బలంతో దాటనివ్వడమో, నిర్ణయించడానికి తాత్కాలిక అధ్యక్షుడు జనరలు లీసూంగ్ జెనెకు 72 గంటలు మాత్రమే వ్యవధి ఉన్నది.

చైనాకాబినెటు కమ్యూనిస్టులషరతులను ఆమోదించనిచో, కమ్యూనిస్టులు నది దాటడానికి చేసే ప్రయత్నాలను నిరోధించడానికి కొమింటాంగు సైనికవేత్తలు ఉమ్మడిగా సహకరిస్తారని సైనికవర్గాలవారు చెబుతున్నారు.

నిన్న నాన్కింగుకు పంపబడిన శాంతి పథకంలో ప్రభుత్వ ప్రతినిధుల, కమ్యూనిస్టుప్రతినిధుల అభిప్రాయాలే కాక, శాంతి సంభాషణలలో పాల్గొంటున్న మూడవ పక్షానికి చెందిన పదికమ్యూనిస్టేతర వర్గాలవారి అభిప్రాయాలుకూడా పంపబడినట్లు కమ్యూనిస్టు రేడియో తెలిపింది.

హ్వాంగ్‌షావోసియూంగ్ ద్వారా కమ్యూనిస్టులు చైనాప్రభుత్వానికిపంపిన 24 నిబంధనలతోగూడిన సంధిప్రణాళికను సంధిఒడంబడికగా ప్రభుత్వవర్గాలు అర్థం చేసుకుంటున్నారనీ, దీనిపై సాధ్యమైనంతవరకు రాజీ సాధించడానికి ప్రయత్నిస్తారనీ తెలుస్తున్నది.

కమ్యూనిస్టులకు ప్రభుత్వంఇచ్చే జవాబును చంగ్‌కైషేక్ ఆమోదించవలసి ఉంటుందని ఒకరు చెప్పారు.

అగ్నిమాపక దళంవారు మంటలనార్పి విరూపాక్షస్వామిరథాన్ని రక్షించడానికిప్రయత్నిస్తున్నారు

## హంపీ విరూపాక్షస్వామి రథం అగ్నిదేవుని కాహుతి

### మంటలనార్పడానికి జరిగిన ప్రయత్నాలన్నీ వృధా అయిపోయినవి

హంపి, ఏప్రిల్ 17: శ్రీ హంపి విరూపాక్షేశ్వరస్వామివారి సర్వాలంకార శోభితమైన పెద్దరథము నిన్న మధ్యాహ్నము సుమారు ఒంటిగంటకు, చాలా చిత్రముగా నిప్పంటుకొని దగ్ధపటలమైనది.

అగ్నిజ్వాలలు రథము శిఖరమునగల కలశమువద్ద ప్రారంభించి, క్రమముగా క్రిందకు ప్రాకినవి. రథారోహణ మొనర్చి, మంటలను ఆర్పుటకు వీలయినది కాదు. అనతికాలమున మంటలు రథాలంకార వస్త్రములకు అంటుకొని, రథమునకు కట్టిన త్రాళ్లు కాలిపోయినవి. పైచట్టమంతయును కాలి గడ్డపై కూలిపోయినది. రథాలంకార ప్రతిమలు, ద్వారములు, కాలి కూలిపోయినవి. రథపుగడ్డకు, అలంకారముకొరకై 4-5 పీపాల తారునూనె పూసి యుండుటచే, ఏకకాలమున అగ్నిజ్వాలలు ప్రాకిపోయినవి. వేలకొలది యాత్రీకులు తమ యావచ్ఛక్తిని వినియోగించినను ఈ మంట లార్పుటకు సాధ్యమయినది కాదు, వీరు పోసెడి నీరు మంటలను తాకనేలేదు. దాదాపు రెండు గంటలకు హొసపేటనుండి అగ్నిమాపక దళమువారు రెండు ఫైర్ యింజనులతో వచ్చిరి. దాదాపు 2 ఫర్లాంగుల దూరమునగల, దేవాలయమునందలి కాలువనుండి గొట్టముల ద్వారా యంత్రసహాయముచే నీరు చిమ్మబడినది. దాదాపు 4-30 గంటల సమయమునకు మంటలు చల్లార్చబడినవి.

80 అడుగుల ఎత్తు గలిగి, మిగుల సుందరమైన బ్రహ్మాండమైన రథపుగడ్డను రోటు లైనను మిగుల్చుటకు, ఇచ్చట జాత్రకొరకై క్యాంపుచేసియుండిన అధికారవర్గమంతయును, వేలకొలది యాత్రీకులును, అగ్నిమాపకదళమువారును, తమ యావచ్ఛక్తిని వినియోగించి పాటుపడిరి. కాని, వృథా ఐపోయినది. రథపుగడ్డ పూర్తిగా కాలిపోయినది. ఈ రథము 50, 60 వేల రూపాయలు వ్యయముచేసి నిర్మించిరి. వ్యాపారులకు గాని, యాత్రీకులకు గాని, ఎవరికిని ఎట్టి నష్టమును సంభవించలేదు.

గత సంవత్సరమున రజాకారుల భీతిచే ఈ రథోత్సవానికి యాత్రీకులు అంతగా రాలేదు. ఈ సంవత్సరమున దాదాపు ఒకటిన్నర లక్షవరకును యాత్రీకులు వచ్చి

(2-వ పేజీ చూడుడు)

## నేటి పంచాంగం

విరోధి సం॥ చైత్ర బ॥ సప్తమి
తా॥ ఏప్రిల్ 19 మంగళవారం
సప్తమి రా8-35 పూషా ప8-8 వర్జ్యం 0-37 ల 12-19 స.

అష్టమి ఏప్రిల్ 20 బుధవారం
అష్టమి రా9-35 ఉషా ప8-33 వర్జ్యం 7-54 ల 9-38 స.


# ఆంధ్రపత్రిక

విరోధి సం॥ చైత్ర బ॥ సప్తమి. మంగళవారం


## స్వతంత్ర ఐరిష్ రిపబ్లిక్

బ్రిటిష్ సింహాసనముతో ఇంత వరకు ఉండిన సంబంధమును-అది దాదాపు నామమాత్రమైనదనే చెప్పవచ్చును-పూర్తిగ విచ్ఛేదము చేసికొనుటతో దక్షిణ ఐర్లెండ్ "సర్వాధికార సమన్విత స్వతంత్ర ప్రజారాజ్యము(రిపబ్లిక్)"గ అవతరించినందుకు ఐరిష్ ప్రజలే గాక, క్రిందటి అర్ధ శతాబ్దముగ ఐరిష్ ప్రజలు సాగించిన స్వాతంత్ర్య పోరాటమును గమనించుచుండిన భారతీయులు ముఖ్యముగ ఆనందింతురు. ఇతర కామన్వెల్తు ప్రభుత్వములు ఈ చరిత్రాత్మక సంఘటనను, ఇకమీదటజరుగు సంఘటనలను విశేష శ్రద్ధతో పరిశీలించెదరు.

తమ దేశము బ్రిటిష్ సింహాసనముతో గల సంబంధమును పూర్తిగ వదులుకొన్నప్పటికిని, బ్రిటన్-ఐర్లెండ్ స్నేహ సంబంధములకు, పరస్పర సహకారమునకు ఎట్టివిఘాతముకలుగదని, పూర్వము వలెనే ఇకమీదటను ఉభయప్రభుత్వములు ఇరువురకు సంబంధించిన విషయములందుకలసి వ్యవహరింపగలవని ప్రధాన మంత్రి కాస్టెల్లో విస్పష్టముగ ప్రకటించియుండెను. కాని, అట్టి సహకారము మారిన పరిస్థితులలో సాధ్యమా యను సందేహము ఐరిష్ రాజకీయవేత్తలతోబాటు, యితర కామన్వెల్తు రాజ్యముల రాజకీయవేత్తలకును కలుగుట సహజము. ఐర్లెండ్ ఆంతరంగిక వ్యవహారములందు బ్రిటిష్ సార్వభౌమునకు ఎట్టిసంబంధము లేకుండ 1936 వ సంవత్సరములో ఐరిష్ రాజ్యాంగమును సవరించిన డివెలరా నిన్నటి ఉన్నతపదవులందు పాల్గొనకపోవుటకు యిట్టి సందేహామే కారణమని చెప్పవచ్చును. యథార్థమునకు నేడు దక్షిణ ఐర్లెండుకు అత్యంత ప్రధానమైనది విదేశ వ్యవహారములను బ్రిటిష్ సార్వభౌముని ద్వారా జరుపు ప్రస్తుతపు ఏర్పాటు రద్దు అగుట గాదు. 1939 లో ప్రారంభమైన ద్వితీయ సంగ్రామమున ఐర్లెండ్ తటస్థముగ నుండిపోవుటకు ఈ ఏర్పాటు ఎట్టి ప్రతిబంధకమును కల్పించియుండలేదు. మిత్రరాజ్యసేనలకు స్థావరముల నిరాకరించుటకు కూడ ఈ ఏర్పాటు ఆటంకములను కల్పించలేదు. అయినను కాస్టెల్లో ప్రభుత్వము, ఐర్లెండ్ సమైక్యతకు కృషిచేయుటకు మారు, నామమాత్రముగ నున్న ఈ సంబంధమును రద్దుచేయుటకు నిశ్చయించెను. ఇందువలన ఐర్లెండ్ కు ప్రస్తుతము కలుగు లాభమునుగాని, నష్టమునుగాని ఏమియు లేకపోవచ్చును కాని డివెలరా, ఆయన పక్షమువారు అభిప్రాయపడినట్లు ఈ విచ్ఛేదనము ఉత్తర-దక్షిణ ఐర్లెండ్ సమైక్యతకు కొంత కాలమువరకైనను ప్రతిబంధకముగ నుండగలదు.

ఈ విధముగ స్వతంత్ర ఐరిషు రిపబ్లిక్ శాసనము అమలు జరుగుట కాస్టెల్లో ప్రభుత్వము ఐరిషు ప్రజల చిరవాంఛితమును సాధింపలేకపోయినను, ఇంచుమించు ఇదే విధమైనస్వతంత్రరిపబ్లిక్ నుస్థాపింపదలుచుకొన్న దక్షిణ ఆఫ్రికా, భారతదేశములు ఒక నిర్ణయమునకు రాగలుగుటకు తోడ్పడవచ్చును. గురువారము లండన్ లో ప్రారంభము కానున్న కామన్వెల్తు ప్రధాన మంత్రుల సమావేశమునందు భారత దేశ భవిష్యత్తుకు సంబంధించిన చర్చలకే ఎక్కువ ప్రాధాన్యత ఉండును. గనుక, ఐర్లెండ్ రిపబ్లిక్ అవతరణకు ప్రత్యేక ప్రాధాన్యత ఏర్పడిన దని చెప్పనచ్చును. భారతదేశము ఐర్లెండ్ మార్గమునే అనుసరింపవలసి యున్నది. బ్రిటిషు ప్రభుత్వము ఇదివరకే బ్రిటన్ లోని ఐరిషు పౌరులకు బ్రిటిషు పౌరస్వత్వము నిచ్చుచు శాసనము చేసియుండెను. ఇతర అధినివేశములు కూడ అట్టి శాసనములను చేసి, తమ దేశమందు స్థిరనివాసమేర్పరచుకొనియున్న ఐరిషు ప్రజలకు పౌరహక్కుల నిచ్చుటకు సమ్మతించెను. "కామన్వెల్తు" స్వతంత్రరాజ్యములు ఐచ్ఛికముగ చేరి ఏర్పరచుకొనిన సమ్మేళన మని అంగీకరింపబడినపుడు స్వతంత్ర రిపబ్లిక్ స్థాయిని పొందిన దేశములు బ్రిటిషు సింహాసనమునకు భక్తి ప్రమాణముచేయకనే కామన్వెల్తునం దుండుట కెట్టి ప్రతిబంధకములు ఉండరాదు.

ఐర్లెండ్ స్వతంత్ర రిపబ్లిక్ అగుట సంతోషదాయకమే. అనతి కాలములోనే ఐక్య ఐర్లెండ్ అవతరణకూడ సంభవించునని ఐరిషు ప్రజలతోబాటు, శాంతి, స్వాతంత్ర్యముల నభిలషించు దేశములన్నియు ఈ సమయమున ఆశించుట సహజము.

## "దేవనాగరి హిందీయే జాతీయభాష కావాలి"

### యు. పి. సాహిత్యసమ్మేళన తీర్మానం

లక్నో, ఏప్రిల్ 17: దేవనాగరి లిపిలో హిందీని భారతజాతీయభాషగా శీఘ్రముగ అవలంబింపవలెనని నేడిక్కడ రెండవ రోజు సమావేశమైన యు. పి. సాహిత్య సమ్మేళనంలో భారతరాజ్యాంగ పరిషత్తుకు సలహానిచ్చుచు ఒకతీర్మానము చేయబడెను.

నేటితో ముగిసిన ఈ సభకు ప్రఖ్యాత హిందీరచయిత కమలాపతి త్రిపాఠి అధ్యక్షత వహించిరి. ఇండియాకు ఒకే ఒక సంస్కృతి కలదని, ఈ సంస్కృతియే భారతీయులకు ధైర్యస్థైర్యములను చేకూర్చునదని, ఈ సంస్కృతికి దేవనాగరి హిందీయే చిహ్నమని ఆ తీర్మానములో నున్నది.

హిందీ ప్రోత్సాహవాదియైన యు. పి. శాసన సభాధ్యక్షుడు పురుషోత్తమదాసు టాండన్ తీర్మానమును సమర్థించుచు ఇంగ్లీషు, పైనీసు భాషలకన్నా ప్రపంచంలోకెల్లా పెద్దభాష హిందీయేనని, హిందీ జాతీయభాష అనుటకు వ్యతిరేకించువారు, హిందీ సమస్య స్వరాజ్య సమస్యయే నన్న మహాత్మాగాంధీ వాక్కులను మరచిపోయిన ట్లున్నారనీ అనెను.

జమియాత్-ఉల్-ఉలేమా-ఇ-హింద్ సమావేశంలో నేడు యు. పి. ప్రధాని పండిత్ గోవింద వల్లభపంత్ మాట్లాడుచు, హిందూ-ముస్లిం సమస్యకు మతసంబంధము లేదని ఉద్ఘాటించెను.

## బరోడా ప్రజాసంఘం దావా

బరోడా, ఏప్రిల్ 17: బరోడా సంస్థానమును బొంబాయి రాష్ట్రములో కలుపుటనుగూర్చి తీర్పు యివ్వవలసిందిగా కోరుచూ ప్రజామండలివారు బరోడా కోర్టులో దావా చేయనున్నారు.

## రిపబ్లిక్ గా దక్షిణ ఐర్లెండ్ అవతరణ

[1 వ పేజీ తరువాయి]

ప్రభుత్వం, ప్రజలతరపున రిపబ్లికుకు జోహార్లున్నూ, మీ అభివృద్ధి క్షేమాలు కోరుతూ సభాకాంక్షలున్నూ పంపుతున్నాను. మనకు అనేక బంధములున్నవి. మన ఉభయదేశములమధ్య దృఢమైన సఖ్యత ఉండగలదని విశ్వసించుచున్నాను."

### ప్రధాని నెహ్రూ సందేశం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 17: "ఐర్" స్వతంత్ర రిపబ్లిక్ గా అవతరించిన సందర్భంలో వారికి తమ సుభాకాంక్షలను తెలుపుతూ భారత ప్రధాని పండిత నెహ్రూ, ఐర్ ప్రధానికి ఈ క్రింది సందేశమును పంపెను:

"ఐర్ ప్రజలకూ, ప్రభుత్వానికీ మా సుభాకాంక్షలను అందజేయ కోరుతున్నాము. ప్రపంచశాంతిని కాపాడటంలోనూ, ప్రపంచంలో ప్రజాస్వామిక స్వాతంత్ర్యాన్ని వ్యాప్తిచేయటంలోనూ మనం చూపే సహకారం మన ఉభయ దేశాల మధ్యనూ ఉన్న స్నేహసంబంధాలను మరింత దృఢపరచగలదని విశ్వసిస్తున్నాను."

### శరత్ బోస్

కలకత్తా, ఏప్రిల్ 17: శ్రీ శరచ్చంద్ర బోస్ ఐర్ రిపబ్లిక్ అధ్యక్షునికి క్రింది సందేశమును పంపెను:

"ఈ సందర్భంలో మీ ప్రభుత్వానికీ, ఐర్ ప్రజలకూ ఇండియన్ సోషలిస్టు రిపబ్లికన్ పార్టీ, నేనూ మా గాఢ పద్భావాన్ని అందజేస్తున్నాము. రిపబ్లికన్ ఐర్లండూ, రిపబ్లికన్ భారతదేశమూ కలిసి ప్రపంచశాంతికీ అభ్యుదయానికీ కృషి చేయగలవని భావిస్తున్నాను."

### పూర్వచరిత్ర

ఐర్లండుపైఇంగ్లీషువారిదాడి 1167 లో ప్రారంభమైనది. క్రమక్రమంగా వారక్కడ ఉత్తరప్రాంతంలో పాదుకుని బలపడి 1607 లో అల్ స్టర్ రాష్ట్రము నేర్పరచిరి. ఆనాడు విభజితమయిన ఐర్లండ్ ఈనాటికీ విభజించబడే ఉన్నది. బ్రిటన్ ఆధిపత్యమును కూలదోయుటకు ఐర్ ప్రజలు ఇన్ని శతాబ్దాలనుండి పోరాడి ఈనాటికి సాధించిరి. కాని బ్రిటన్ తో సంబంధం కలిగిఉన్న అల్ స్టర్ మాత్రం ఈ నాటికీ బ్రిటన్ లో ఒకభాగంగా మాత్రమే ఉన్నది అల్ స్టర్ రాజధాని బెల్ ఫాస్ట్. కిందటి సం॥ జరిగిన ఎన్నికలలో బ్రిటన్ తోనే కలిసి ఉండవలెనన్నవారికే అల్ స్టర్ లో విజయం లభించింది.

1167 సం॥లో వేల్సు రాష్ట్రంలో నివసించే నార్మన్, వెల్ష్ ప్రజలు ఐర్లండుపై మొట్టమొదటిసారిగా దండయాత్రలు ప్రారంభించారు. అది క్రమ క్రమంగా విస్తరించి 1607 నాటికి అల్ స్టర్ రాష్ట్రం అధిక సంఖ్యాకులయిన ఇంగ్లీష్, స్కాచ్ ప్రజలతో ఏర్పాటయినది.

ప్పటినుంచి ఐర్ ప్రజలు బ్రిటిష్ వారిని పారదోలటానికి అనేక సాయుధవిప్లవాలు, పోరాటాలు తరతరాలుగా జరిపారు కాని, అవన్నీ విఫలమై పోయినవి. ఈ పోరాటాలలో అనేక మంది ఐరిష్ దేశభక్తులు ఉరికంబాల నెక్కటమూ, దేశభ్రష్టులు చేయబడటమూ జరిగినది. అనేకమంది వలస వెళ్లిపోయినారు. ఈవిధంగా పోరాటాలు జరుగుతున్నప్పటికీ 1800 సం॥ వరకూ ఐర్లండ్ ఒక ప్రత్యేక దేశంగానే పరిగణించబడేది. 1800లో బ్రిటిష్ పార్లమెంటు 'యూనియన్ ఆఫ్ ఐర్లండ్' చట్టాన్ని చేసి తద్వారా దాన్ని బ్రిటనులో ఒక రాష్ట్రంగా కలిపివేసి దాని ప్రత్యేకత్వాన్ని తీసివేసినది. ఐర్లండుకు కామన్సు సభలో 100 స్థానాలు, ప్రభువులసభలో 34 స్థానాలు ఇవ్వబడినవి.

ఐరిష్ప్రజలు బ్రిటిష్ పార్లమెంటులో ప్రవేశించి తమకు స్వపరిపాలన ఇవ్వవలసినదని పార్లమెంటరీ పోరాటం సాగించారు. 19 వ శతాబ్దం చివరిభాగంలో బ్రిటిష్ లిబరల్ ప్రధాని గ్లాడ్ స్టన్ ఐర్లండుకు స్వపరిపాలన (హోంరూల్) ఇవ్వాలని ప్రయత్నించాడు కాని అది సాగలేదు. 1915 సం॥లో ప్రధానిగావున్న ఆస్క్విత్ ఈపని చేయ ప్రయత్నించగా అల్ స్టర్ రాష్ట్రం తనను ఐర్లండునుండి విడదీయాలని పట్టుపట్టి బలంద్వారా తన కోర్కను సాధించుకొనటానికై నిధులను తయారుచేయటం మొదలు పెట్టినది. ఈ పద్ధతికి నాయకత్వం వహించిన ఇ. ఇ. స్మిత్ తరువాత లార్డ్ బర్కెన్ హెడ్ అయి ఇండియా మంత్రి అయినాడు. కాని మొదటి ప్రపంచ యుద్ధం రావటంతో ఇది వెనుకబడ్డది.

కాని ఐర్ ప్రజలు మాత్రం 1916 లో ఒక పాన సైన్యాన్ని ఏర్పరచి ఒక రిపబ్లికును స్థాపించగా బ్రిటిష్ సైన్యాలు వచ్చి వారిని అణిచివేసి నాయకులను 16 మందిని కాల్చివేసి అనేకమందిని ప్రవాసం పంపినవి. ఈ విధంగా చంపబడిన వారిలో ప్రస్తుత ఐర్ విదేశాంగ మంత్రి మెక్ బ్రిడ్ తండ్రి కూడా ఉన్నాడు. ఆతరువాత సర్ ఆర్థర్ గ్రిఫిన్ డీవలరా మొదలైన ప్రముఖులు సిన్ ఫైన్ ఉద్యమం నడిపి అత్యద్భుతంగా బ్రిటిష్ వారిని ప్రతిఘటించారు. చివరకు 1921 లో బ్రిటిషువారు దానికి అధినివేశ ప్రతిపత్తిని చ్చారు. అధినివేశ ప్రతిపత్తి అంటే బ్రిటిష్ రాజసంబంధం ఉంటుందని డీవలరా మొదలైనవాళ్లకు గిట్టలేదు. కాస్ గ్రీవ్ మొదలైనవాళ్ళు దానిని సమర్థించారు. కాస్ గ్రీవ్ 1922 నుండి 1931 వరకూ ప్రభుత్వాన్ని నిర్వహించాడు. డివలరా 1931 నుండి 1948 వరకూ ప్రధానిగా ఉన్నాడు. 1948 ఎన్నికల్లో ప్రస్తుత ప్రధాని కాస్టెల్లో అధికారంలోకి వచ్చాడు.

ఇంతవరకూ ఐర్ స్వదేశ వ్యవహారాలను అధ్యక్షుడి పేరుతోనూ, విదేశ వ్యవహారాలను బ్రిటిష్ రాజు పేరుతోనూ వ్యవహరిస్తున్నది. కాని కాస్టెల్లో ప్రభుత్వం వచ్చి ఐర్ పూర్తిగా రిపబ్లిక్ గానే ఉండవలెనని నిర్ణయించి 'రిపబ్లిక్ ఆఫ్ ఐర్లండ్' చట్టము (1948) న చేసినది. అది ఈ నాడు అమలు జరిగినది.

# మంత్రివర్గం మార్పుపై రాష్ట్ర శాసనసభలో ప్రశ్నలు

## మాజీ మంత్రులు కూర్మయ్య, అవినాశలింగంగార్ల ప్రకటనలు

### పాతమంత్రులు ప్రకటన చేయవచ్చునా?

చెన్నపట్నం, ఏప్రిల్ 18: నేడురాష్ట్ర అసెంబ్లీలో ప్రశ్నల కాలానంతరం స్పీకరు శివషణ్ముగంపిళ్ళగారు శాసనసభా నిబంధనలు 4 వ (ఎ) ననుసరించి మాజీ విద్యామంత్రి అవినాశిలింగం చెట్టిగారు ప్రకటన చేస్తారనగానే సభలో కలకలము బయలుదేరెను. అన్నాప్రగడ కామేశ్వరరావుగారు లేచి మంత్రివర్గనిర్మాణము పూర్తికానిదే ఎట్టిప్రకటనా చేయుట భావ్యమాఅనియు రేపుమళ్ళీ ప్రభుత్వ స్థానములలోకి రావచ్చుననియు, అందువల్ల ఆ వ్యవహారముపూర్తికానిదే ఆయన ప్రకటన చేయుటకు వీలులేదనిరి. ఇంతేకూ ఆయన మంత్రివర్గమునుంచి రాజీనామా నిచ్చినాడా లేక త్యజించబడినారా అని సభ్యులనవ్వుతుండ కామేశ్వరరావుగారు అడిగిరి.

స్పీకరు :- ఆయన రాజీనామా ఇచ్చినాడో, లేక వదలివేయబడినాడో నాకు నిమిత్తములేదు. ఆయన మంత్రివర్గంలో రాజీనామాఇచ్చినారు. ఆయన ప్రకటన చేసెదనన్నాడు. పి. నటేశన్ :- ఆయన ఒక్కడే మంత్రివర్గంనుంచి రాజీనామా నివ్వలేదు. మిగతావారుగూడా ఇచ్చినారు. ఒక్కరు ప్రకటనచేసిన మిగతావారంతా చేయవలెను. దానికి అనుమతించెదరా?

స్పీకరు :- తప్పక అందరూ చేయవచ్చును.

శ్రీ పి. నటేశన్ :- కొత్తమంత్రి వర్గమువచ్చినది. మంత్రులకు సంయుక్త బాధ్యతఉన్నది. కొందరుమంత్రులు తిరిగి వచ్చినారు. అందువల్ల వ్యక్తిగతముగా ప్రకటనచేయవచ్చునా? మీ రూలింగ్ అడుగుచున్నాను.

స్పీకరు :- మంత్రివర్గమంతయూ రాజీనామానిచ్చినది. అందులో అవినాశలింగంగారు ప్రకటన చేస్తానన్నారు. చెయ్యమన్నాను.

అవినాశలింగంగారు ప్రకటన ప్రారంభించి చదువుతుండగా ఆర్. వి. స్వామినాథన్ గారు ఒక ఆక్షేపణ అంటూ లేచి ఇటుల చెప్పిరి. "అవినాశలింగంగారు మంత్రివర్గంలోంచి ఎందుకు పోయిరో చెప్పలేదు. ఆ కారణాలేమో చెప్పవలెను. ఆయన విద్యపై ఉపన్యాసము ఇచ్చుచున్నారు. ఆయన రాజీనామా కారణములు చెప్పగోరెదరు.

అది ఆక్షేపణగాదని అవినాశలింగంగారు తమ ఉపన్యాసమును చదివిరి. ఉపన్యాసములో తాము విద్యోద్ధరణకు చేసిన సేవను వివరించుచూ విద్యావ్యాపనే తన జీవిత పరమావధి అనిరి. వారు ఉపన్యాసము ముగించినంతనే హమీద్ ఖాన్ గారు లేచి విద్యామంత్రి ప్రకటన అనేక వివాదములకు ఆస్పదమై ఉన్నదనియు దానిపై చర్చకు అనుమతించవలెననియు సభ్యులు నవ్వుచుండ తెలిపిరి:

చినకాశీగారు అనేకసార్లు ఆక్షేపణ అంటూ లేచిరి. కాని 'సద్దు సద్దు' అంటూ అధ్యక్షులు మందలించిరి.

కూర్మయ్యగారు ఉపన్యాసము చదువుతూండగా కామేశ్వరరావుగారు అది చాలా దీర్ఘముగా ఉన్నదని ఆక్షేపించిరి.

మాజీమంత్రులు ప్రకటన చేయుచున్నపుడు కొంత కలకలము సభలో జరుగుచుండగా మాజీమంత్రుల ఉపన్యాసములు తమకు వినిపించుటలేదనీ, సభవారు శాంతముగా ఉండవలెననియు పలుమారులు స్పీకరు తెలుపుతూవచ్చిరి.

మంత్రు లిద్దరూ ప్రకటనలు ముగించి తర్వాత సభానాయకులు ఏమైనా చెప్పెదరా అని సభాధ్యక్షులు అడుగగా సభానాయకులు తాము చెప్పేదేమీలేదని చెప్పిరి.

ప్రతిపక్షనాయకులు ఇస్మాయిల్ గారు "పాతమంత్రి వర్గము మారినది. కొత్త మొఖాలు మా ఎదురుగా కనిపించుచున్నవి. అట్టియెడ పాతవారు కొందరు వెళ్లిపోవుటకు, కొందరు ఉండుటకు కొత్తవారు కొందరువచ్చుటకు కారణము తెలుసుకొను హక్కు సభ్యులకున్నది. కొత్త ప్రధాని మంచి ఇంగితజ్ఞానము ఉన్నవారు, సహృదయులు. సత్ప్రవర్తకులు. వారి మంత్రివర్గము దిగ్విజయముగా సాగునని తలచుచున్నాను. కొత్తవారిద్దరూ యువకులు. శక్తివంతులు. వారికిగూడా శుభాకాంక్షలు తెలుపుతున్నాను. వారి కార్యనిర్వహణమునందు దేశసౌభాగ్యసంపదల పెంపొందించు కృషియందు భగవంతుడు వారికి తోడ్పడి ఆయురారోగ్యభాగ్యముల నివ్వవలెనని కోరుచున్నాను.

ఇంతకూ తరిమివేయబడిన వారినెందుకు తరిమివేసినారో తెలుపగోరుచున్నాను. మాడు మాసముల క్రితము మీలో మీకు విభేదములు లేవన్నారు. రేపు ఎన్నికలనగా అందరూ ఏకముగా వలెనని మాజీప్రధాని హితోపదేశము చేసినారు. మర్నాడు తమ హితము సభ్యుల చెవుల చొరనందున ఉపసంహరించుకొనుచున్నామన్నారు. కాంగ్రెసు సభలోనే ఒక వర్గమునకు మరొక వర్గమునకు వచ్చిన కలతలవల్ల ఈ వ్యవహారము వచ్చినట్లున్నది. వారి భేదములకు కారణమేమి? కొత్తవారు వచ్చుటకు కారణమేమి? కొత్తవారికి ఏమైనా కొత్తవిధానము ఉన్నదా?

అందరూ కాంగ్రెసువారమేననీ అందరిదీ కాంగ్రెసు విధానమేననియు చెప్పుచున్నారు. అట్టియెడ ఆకారణముగా ఈ మార్పు జరిగి ఉండదు. మార్పుకు పద్ధతి, విధానము కారణముగానిచో కారణమేమో చెప్పకతప్పదు. పూర్వమంత్రుల చర్యలు ఏమైనా యిందుకు కారణములా? ఇదేమో సాకల్యముగా తెలుపవలసిన బాధ్యత ప్రభుత్వమువారిపై ఉన్నది. ఇది రాజ్యాంగ హంశమునకు చెందిన ప్రశ్న. ఒక మంత్రివర్గముపోయి మరొకమంత్రివర్గం వచ్చినందుకు కారణము చెప్పవలెను.

ఇంకొక సంగతి. ప్రధాని కాంగ్రెసు అధిష్ఠానవర్గమును సంప్రదించిగాని నిర్మాణము చెయ్యనన్నారు. అట్టియెడ మంత్రుల చర్యలపై బాధ్యతెవరది? మంత్రివర్గ నిర్మాణము పూర్తిగా ప్రధానిది కాదా!

సభా నాయకులు: ఈ శంకలన్నీ తెలుపుటకు ప్రతిపక్షనాయకునకుహక్కు లేదని నా అభిప్రాయము. వారు తెలిపిన విషయములన్నిటికీ పూర్వప్రధాని కొన్ని లులో 20 వ తేదీన ప్రకటన బహుశః చేయగలరని ఆశించెదను."

## అవినాశలింగంచెట్టి గారి ప్రకటన

శ్రీ అవినాశలింగం చెట్టిగారు, మాజీ మంత్రి నేడు అసెంబ్లీలో ప్రశ్నోత్తరముల అనంతరం ప్రకటన గావించుచు, తనకు మంత్రిగానుండి అవకాశ మిచ్చినందుకు ప్రజలకు కృతజ్ఞత తెలిపి, తాను విద్యామంత్రిగా నున్నపుడు అనేకరీతుల సహాయం చేసిన ఉద్యోగ బృందానికి, కమిటీల సభ్యులుగ నుండిన అధికారేతర సభ్యులకు కృతజ్ఞత దెలిపిరి. ఈకాలంలో కొన్నిచిక్కులుండెను. అవన్నీ వారి సహకారముతోనే దాటగల్గితిమనిరి.

విద్యా సంస్కార సమస్య పాతికేండ్ల క్రిందటినుండి ఆలోచనయందున్నది. గాంధిమహాత్ముడు దారిచూపెను. అదితను సరించి అనులు జరిపి బేసిక విద్యావిధానము, సెకండరీ విద్యావిధానము మార్పు ప్రారంభించితిని. ఇదియు వయోజనవిద్య, అంగహీనులకు బాలబాలికలకు విద్యావ్యాప్తి గూడ యిక ముందు పూర్తియగునని ఆశించుచున్నాను.

ఉపాధ్యాయుల జీతాల అభివృద్ధికి ఎంతవరకు వీలుంటో అంతవరకు (నేను కున్నంతగా కాకపోయిన) చేసితిని. ఎయిడెడు పాఠశాలలో పాధ్యాయుల గ్రాంటులు పెంచుటేగాక నెలనారీగ్రాంటులుగ మార్చితిని. భవనముల గ్రాంటు యివ్వరాదను, అద్వాయిజరు ప్రభుత్వ నిషేధం తొలగించితిని.

నేడు విద్యాసంస్థలందు నేర్పుచున్న విద్యయే విద్యకాదు. ఉన్నత పరిశోధనకు కళావిజ్ఞానభాషా వికాసమునకు అవకాశములుండవలెను. అందుకొరకై విశ్వవిద్యాలయాలకు గ్రాంటులిచ్చి, దేశభాషలకు ఎక్కువ గౌరవమొసంగి, ప్రైజులు యిచ్చి మున్నగు పనులు చేసితిమి. అరవం, తెలుగు విజ్ఞానసర్వస్వములు తయారుచేయ ప్రారంభించితిమి. ఆస్థాన పండితుల నియమించితిమి. గానకళాశాల స్థాపింప ఏర్పాటుచేసితిమి. కవిభారతి పాటలను సంపాదించి ప్రజలందరికి అందజేసితిమి. ప్రాచీన వ్రాతప్రతులు అచ్చువేయించ ఏర్పాటుచేస్తున్నాము.

ఇంత ఎక్కువ మార్పులు చేయునపుడు ఏదో కొంత ప్రతికూలత ఉండక తప్పదు. అవి సఫలమయినాక యిపుడు ప్రతికూలంగా నున్నవారే అనుకూలంగా మారగలరు. ఈ సంస్కరణలు కొద్దిగా మార్పులతోనైనా అమలు జరుగుననే ఆశించుచున్నాను.

"ఈకాలం విద్యావిధానమునకు బాధ్యులయినవారు కొంత ఉపజ్ఞచూపవగల్గి పని చేసిరని ముందు తరంవారనుకుంటారని నమ్ముచున్నాను. నాస్కీములన్నింటిని ఆమోదించి, బడ్జెటులో అవకాశమిచ్చిన సభవారికి కృతజ్ఞుడను.

"నాకు విద్యావిధానము అభిమాన విషయమే. కాక జీవిత పరమావధిగ ఎంచుచుందును. జీవిత కాలంలో ఎక్కువ భాగం బిడ్డల విద్యాభివృద్ధికి కృషిచేయుటలో గడపితిని, యిక ముందుకూడ గడపదలచితిని. మన దేశం బిడ్డల కనుగుణ్యమగు విద్యావిధానం గాంధి సూచించిన రీతిని, ఇప్పుడు ఎవరిని నిందించుటకు యీ ప్రకటన చేయలేదు. నాకు ఎవరిపై నద్వేషం లేదు.

"మంత్రి పదవిలో ప్రజాసేవ చేయుట కవకాశాలు ఎక్కువ ఉన్నాయి. కాని అస్థానంలో నేనున్నా పరే యింకొకరున్నా ఒకటే. మనమంతా అనంతమయిన జాతిలో అను మాత్రులము. మన బిడ్డలను గుణవంతులుగ బలవంతులుగ, ఆదర్శ నీతులుగ చేయుగల విద్యావిధానం తయారుచేసి జాతి అభివృద్ధికి తగినపునాదు వేయుటే ముఖ్య కర్తవ్యము. ఈ కార్యమునందు, ప్రస్తుతానికి మనమే స్థానములలోనున్నా, నా సహోద్యోగులకు ఏ సహాయంసేవ సర్వదా అందు విడిగా నుందునో, దైవకృపవల్ల యీఘన కార్యం సాధించెదను గాక.

## కూర్మయ్యగారి ప్రకటన

మాజీమంత్రి శ్రీ వే. కూర్మయ్య గారు తమ ప్రకటనలో యిట్లు తెలిపిరి:

"మనరాష్ట్రంలో నాయకత్వం మారినపుడెల్లా మంత్రివర్గం మారుచున్నది. ప్రాతమంత్రులలో ఏడ్గురు తిరిగివచ్చిరి. నేను మరిముగ్గురు బయట నుండిపోతిమి. మా రాజీనామాలు ప్రస్తుతానికి అంగీకరించే మన్నారు. ప్రజాపరిపాలనా విధానమునందు యితర దేశాలలోవలె మంత్రివర్గం మార్పుతోబాటు ప్రభుత్వవిధానంకూడ మారును. కాని మనరాష్ట్రంలో అట్లు కాదు. అందుచే యీ మార్పువలన ప్రజలలో యించుక చలనకలిగింది. మాలో కొందరి నేల క్రొత్తమంత్రివర్గమునందు చేర్చలేదని వారాలోచనపడుచున్నారు. మేముపూర్వపు కష్టగించిన పనులకు తగియుండలేదా యని అడుగుచున్నారు. మేమేదో తప్పులు చేసినందుకే తొలగించిరని సమాధానం చెప్పుకొంటున్నారు. పత్రికలలో అట్లువ్రాస్తున్నారు కూడాను. మా విధులు మా బాధ్యతలను మా శక్తికొలది శ్రద్ధగ మనస్ఫూర్తిగ నిర్వహించితిమని ఈ సభలో చెప్పవలసియున్నది

"హరిజనోద్ధరణయందునిమ్న జాతులఉద్ధరణయందు నాశక్తివంచనలేక ఈ రాష్ట్రమందు సేవచేసితిని. అదంతా యిక్కడ చెప్ప నవసరంలేదు. కాని, నా ఆర్తనలను అడిగి యున్న జాతులవారికి కష్టనష్టములు కలుగనివ్వలేదని చెప్పిన చాలును. సుమారు పత్యాగ్రహాశ్రమమున త్రిచ్చిదయి, కాశిలో విద్యాభ్యాసము ముగించిన యువకులొక్కలనుండి నేను, నోయడేరి నిమ్న జాతులయందు రాజకీయ చైతన్యం కలిగించుటకు పాటుబడుచు, వారికి హాస్టలు స్కూలుచిప్పలు ఏర్పాటు చేయుచుంటిని. స్వార్థరహితంగా వారి సేవచేయుచుండుటచేతనే ఆంధ్రదేశములో యీనాడు జాతియందు కూర్మయ్య అనే పేరు ప్రతివారియింట వెలియుచున్నది.

### మంత్రిగ చేసినపని

సతమూడేండ్లు మంత్రిగ వారికి ఉపయుక్తంగా సేవచేయగల్గితిని. పేదజన బాహుళ్యంలో సర్వదా పరిచయం కల్గించుకొని వారి కష్టనష్టములను తెలుసుకొనుచుంటిని. వారి ఫిర్యాదులు విని న్యాయం చేకూర్చుచుంటిని. ఎక్కడికిపోయిన వందలకొలది పేద హరిజనులు కట్టుపడ్డ లేనివారు వచ్చి మొరపెట్టుకొనుచుండిరి. కొన్నాళ్ల క్రిందట సభానాయకుడు స్వాతంత్ర్యం వచ్చినా ప్రజలలో మార్పు కనబడలేదనిరి. నే నామాట నంగీకరించను. బ్రిటిషు రాజ్యంలో హరిజనులు తమ బాధలకోర్చి పడియుండిరి. నేడు వారు తమకూ ఆత్మలు గలవని గుర్తించిరి. మారుమూలల గ్రామాల నుండి తమ మొరలు ఫోర్టుసెంటు కోటలో విన్నబడగలవని గుర్తించిరి. వారికి రాజకీయ చైతన్యం కలిగింది. మానవులుగా తమకు కొన్ని హక్కులు గలవని గుర్తించి వాటిని సాధించుటెట్లో తెలుసుకొనిరి. మూక ప్రజయగు యీ అడుగున బడియున్న నిమ్నజాతులను లేవనెత్తే కార్యంలో బాపూజీ కలలు సఫలం చేయుటంలో కూర్మయ్య మంత్రి ఉచిత భక్తితో సేవచేసెను.

"నా కాంగ్రెసు మిత్రులు కొందరు హరిజన చేరికపోయి వారికష్టాలు తెలుసుకొనేవారు. కాని అచటి పరిస్థితులుగాంచి భయపడి పారిపచ్చిరి. అసహాయులయినవారు ఆదుగంటిన వేరొక రాజకీయపార్టీలో చేరిపోయియుందురు. కాని హరిజనమంత్రి తమ మధ్యకువచ్చి ప్రభుత్వంలో విశ్వాసం కల్పించి, వారికి న్యాయంచేకూర్తునని చెప్పటచే, వారు కాంగ్రెసులోనుండిరి. తాముకష్టపడి బాగుచేసుకొన్న భూములను తిరిగి ప్రభుత్వం వారు తీసుకుంటున్నారని ఫిర్యాదు చేయగా, గతప్రభుత్వంవారు భూములులేని పేదవారికిచ్చిన భూములు తీసుకోరాదని ఉత్తరువు చేసిరి. ఆయినా స్థానికోద్యోగులు లక్ష్యపెట్టలేదని రాగా, నేను జోక్యంకల్గించుకొని, అట్టి అన్యాయం తిరిగిజరుగకుండా చేస్తిని. ప్రభుత్వ అడవులలో తంగేడు, తేలంగి చేరడు గుత్తలు ధనికులకుయివ్వక, చెప్పులు కుట్టుకొనే కులాల సహకారసంఘాలకు యివ్వునట్లు ఉత్తరువు చేస్తిని.

దేవాలయ ప్రవేశంవల్ల సంఘబహిష్కారం ప్రాప్తించింది. అట్టిది జరుగకుండ, పనితనులకూడా గల గ్రామ సంఘాలు స్థాపించితిని. వాటిద్వారా హరిజనుల సివిలుహక్కులు కాపాడబడుచున్నవి. చేపలపట్టు పల్లెవారికి సహకార సంఘాలకే చెరువులుగుత్త అభిమానించి యివ్వాలని యోచించుచుంటిమి. ఈవిషయమయి యిప్పటి ప్రభుత్వం వారు సానుభూతితో ఉత్తరువు చేయుదురని నమ్ముచున్నాను. హరిజనుల యింట్లవసతి, చేరిల అభివృద్ధి మున్నగుసమస్యలు మిగిలియున్నవి.

## హంపి విరూపాక్షస్వామి రథం పరశురామ ప్రీతిఅగుటు

[1 వ పేజీ తరువాయి]

యున్నారు. 13 వ రథోత్సవం జరిగెను. దివారాత్రములు హొస్పేటనుండి యిచ్చటికి వచ్చిపోయెడి మోటారు బస్సుల హడావిడియందున మోటారుక్రింద పడి ఒకమనుష్యుడు మరణించెను. దేవతా రథము కాలిపోవుట దేశమునకు అరిష్ట దాయకమని యాత్రికులనుకొనుచున్నారు.

ఇప్పటి శ్రీ విద్యారణ్య విజ్ఞానసమితి వారు రథోత్సవమునాటినుండి నాలుగు రోజుల వరకు దినమునకు దాదాపు 4 వేల మందికి పేదలకు, భిక్షుకులకు రొట్టెలను కూరను పంచిపెట్టిరి. ఒకరోజున యాత్రీకులకు పానకము మజ్జిగ ఇచ్చిరి. ఆశ్రే మాధికారులు హాలప్పగారును, సేవానిరతులు కొండజూకు హంపమంత్రప్పగారును ప్రశంసార్హులు.

## కొత్త మంత్రులు

చెన్నపట్నం, ఏప్రిల్ 18: నేడు మద్రాసు అసెంబ్లీ వారు సమావేశమైనప్పుడు కొత్తమంత్రి నీలం సంజీవరెడ్డిగారు ముందువచ్చిరి. వచ్చి వారుమామూలుగా కూర్చుంటూవుండిన పి. ఎల్. ఎన్. రాజుగారి స్థానముప్రక్కన కూర్చొని రాజుగారితోను, ఇతర మంత్రులతోనూ కులాసాగా కాలక్షేపముచేసి మిత్రుల అభినందనల నందుకొనిరి. ప్రతిపక్ష సభ్యులు సంజీవరెడ్డిగారి నభినందించిరి. ప్రధాని కుమారస్వామి రాజాగారు రామస్వామిరెడ్డిగారి స్థానములో కూర్చొనిరి. వారిప్రక్కన గోపాలరెడ్డి, రాజన్, భక్తవత్సలం, మాధవమీనన్, ఏ. బి. షెట్టి, సీతారామరెడ్డి, చంద్రమౌళి, పరమేశ్వరన్, సంజీవరెడ్డిగారలు వరసగా కూర్చొనిరి. ప్రభుత్వస్థానములలో ఆఖరుబెంచి ఖాళీగా ఉంచబడెను.

ప్రధాని కుమారస్వామి రాజాగారు అభినందనలు, చిరునగవుతో ముకుళితహస్తులై స్వీకరించిరి.

సంజీవరెడ్డిగారు మంత్రిఅయినందుకు కల్లూరి సుబ్బారావుగారిని కొందరు సభ్యులు అభినందించి వారిమిత్రత్వమును ప్రశంసించిరి.

## ఈజిప్టు - ట్రాన్స్ జోర్డాన్

కైరో, ఏప్రిల్ 17: ఈజిప్టుకు ట్రాన్స్ జోర్డానుకువచ్చిన అభిప్రాయభేదము లన్నీ శాంతియుతంగా పరిష్కరింపబడినవని ఈజిప్టు రాకపోకల శాఖామంత్రి అబ్బాస్ పాషా నేడిక్కడ ఈజిప్టుమంత్రివర్గ సమావేశానంతరం చెప్పెను.

# చెఱకు పంట తగ్గింపు

## అధికాహారోత్పత్తికి ఢిల్లీ సభ నిర్ణయాలు

### చెన్నరాష్ట్ర కార్యక్రమ వివరణ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 17: భారతప్రభుత్వ వ్యవసాయశాఖ కార్యదర్శి అధ్యక్షతను జరుగుతున్న రాష్ట్రముల సంస్థానముల వ్యవసాయశాఖ కార్యదర్శి డైరెక్టర్ల సమావేశ కార్యక్రమం, 1951 నాటికి ఇండియా ఆహారంవిషయంలో స్వయం సమృద్ధంగా ఉండుటకు యావద్భారతదేశానికి వర్తించేదు కొన్ని ముఖ్యమైన నిర్ణయాలు చేసినమీదట నిన్న ముగిసినది. ముఖ్య విషయాలపై చర్చ జరుగుతున్నప్పుడు భారతప్రభుత్వ ఆహార వ్యవసాయ శాఖా మంత్రి జయరాం దాస్ దౌలత్ రాం కూడా హాజరై ఉండెను. రాష్ట్రాల ఉత్పత్తిని పెంచవలసిన కోటాను నిర్ణయించుట, వ్యవసాయానికి అవసరమగు పరికరాలను త్వరితగతిని సప్లయి చేయుట ప్రస్తుతం చెరకు పంట పండించుచున్న భూమిలో పదవ వంతు భూమిని ఆహారపదార్థాలను పండించుటకు ఉపయోగించుట, సాగుకు లాయకీ అయిన బంజరు భూములను వ్యవసాయం చేయవలసిందిగా వత్తిడిచేసి, దానిమీద ఒక నిర్ణీతకాలం వరకు శిస్తు వసూలుచేయకుండుట, ఉత్పత్తి బాగుగా పెంచేవారికి పతకాలు మొదలైన బహుమానాలిచ్చుట, పై నిర్ణయాలలో కొన్ని:

రాష్ట్రాల ప్రతినిధులు తమ తమ ప్రాంతాలలో ఉత్పత్తిని పెంచేవిషయమై కొన్ని సూచనలుచేశారు. మద్రాసు ప్రతినిధి వ్యవసాయోత్పత్తిని పెంచుటకు రాష్ట్రప్రభుత్వ పథకాన్ని వివరిస్తూ, దీనిప్రకారం 26000 చెరువులు మరమ్మతు చేయటమగుననీ, దీనివలన 50 లక్షల యకరాలు సాగు కాగలవనీ చెప్పెను. ఈపథకానికి అత్యధిక ప్రాముఖ్యతయివ్వాలసిందని జయరాం దాస్ దౌలత్ రాం చెప్పారు.

వ్యవసాయపనులకు అవసరమగు ఇనుము ఉక్కు సిమెంటు, ఇటికలు మొదలగు వాటిని విరిగా సప్లయి చేయటానికి కేంద్ర వ్యవసాయమంత్రిత్వ శాఖలో ఒక ప్రత్యేక ఆఫీసును నియమించుటకు నిర్ణయించడమైనది. వ్యవసాయపనులకు అవసరమగు ఇనుము ఉక్కు కోటాను హెచ్చించటానికి నిర్ణయించి ఏరాష్ట్రానికెంతెంత కావలసిందీ గా తెలియజేయ వలసిందిగా రాష్ట్ర ప్రభుత్వాలకు కేంద్రవ్యవసాయ శాఖ తెలియజేసింది. వ్యవసాయానికి అనుకూలమైన భూమిని బీడుగా ఉంచుట సంఘవిద్రోహచర్యగా పరిగణించబడింది. ఇందుకు ఒకచట్టం ప్రవేశపెట్టి, దీనిని ఉల్లంఘించిన వారిని శిక్షించవలెనని సమావేశం సూచించింది.

# ప్రపంచ ద్రవ్యనిధి చర్చల సమాప్తం

బొంబాయి, ఏప్రిల్ 17: అంతర్జాతీయ ద్రవ్యనిధి రాయబారసంఘం వారికి భారత రిజర్వు బ్యాంకు వారికి మధ్య యిక్కడ జరుగుతున్న సంప్రదింపులు నిన్న శనివారంనాడు ముగిసినవి. ఈ సంప్రదింపులు ముఖ్యంగా, ద్రవ్యవిధానం, ద్రవ్య సరఫరా, మారకం కంట్రోలులకు సంబంధించినవి. భారత రిజర్వు బ్యాంకు వారు రాయబార సంఘం వారికి సమర్పించిన నివేదిక 'యథార్థమైన దిగా' వర్ణించబడింది. అందులో పరిస్థితులన్నీ తేటతెల్లంగా చెప్పబడినవి.

ఇంతకుముందు రాయబారసంఘంవారు ఢిల్లీలో భారతప్రభుత్వంతో ఆర్థిక విధానాలనుగురించి ఇంకా యివ్వవేలిన ధనపు మొత్తాలకు సంబంధించిన సమస్యలను గురించి సంప్రదింపులు జరిపారు. రాయబార సంఘసభ్యులు ఎర్నెస్టు ట్రిక్, పాల్ స్ట్రోడ్, ఇ. డి. ఎబ్లూ. స్పిన్ గార్న్, సోమవారమునాడు లండను మీదుగా వాషింగ్టన్ పోతున్నారు. ఈ సంఘ అధ్యక్షుడు, అతని కార్యదర్శి బుధవారంనాడు దక్షిణాఫ్రికా వెళ్ళెదరని తెలుస్తోంది.

# తిరువాన్కూరులో తమిళుల సత్యాగ్రహ విరమణ

త్రివేండ్రం, ఏప్రిల్ 17: తిరువాన్కూరు సంస్థానంలోని తమిళ ప్రాంతాలు తమిళనాడులో చేరవలసి యున్నదనియు ఆ ప్రాంతములను తమిళనాడులో చేర్చకయుండినందుకు ఆ సంస్థానంలోని తమిళ కాంగ్రెసు కమిటీ ఏప్రిలు 13 నేటిని ఉపక్రమించిన సత్యాగ్రహమును నేడు విరమించెను.

# అటంబాంబు యుద్ధంలో ప్రజారక్షణ

## సూత్ర నిర్ణయానికి రెడ్ క్రాస్ సమావేశం

బెర్న్ (స్విట్జర్లాండ్), ఏప్రిల్ 16: ఇక రాబోయే యుద్ధాల్లో అటంబాంబులను వాడటం జరిగితే సాధారణ పౌరులను కాపాడేనిమిత్తం కొన్ని అంతర్జాతీయ సూత్రాలను ఏర్పరచేనిమిత్తం అంతర్జాతీయ రెడ్ క్రాస్ సమావేశం ఒకటి జెనీవాలో ఏప్రిల్ 21వ తేదీన జరుగుతుంది. ఈ సమావేశంలో పాల్గొనటానికి సోవియట్ యూనియన్ అంగీకరించినదని నేడిచ్చట ప్రకటించబడినది. ఈ సమావేశాన్ని స్విస్ ప్రభుత్వం ఏర్పాటు చేసినది. ఈ సమావేశం అటంయుద్ధసందర్భంలో అనుసరించవలసిన కొత్తసూత్రాలను నిర్ణయించుట మేకాక యుద్ధఖైదీలకూ క్షతగాత్రులకూ సంబంధించిన నియమాలను కూడా ఆధునిక పద్ధతులకు తగినట్లు సంస్కరించటం జరుగుతుంది.

ఇందులో పాల్గొనటానికి రష్యాతో పాటుగా హంగరీ, ఆల్బేనియాలు అంగీకరించినవి. పాల్గొనటానికి జెకోస్లవేకియా యుగోస్లావియా మొదలైన తూర్పు యూరప్ రాజ్యాలింతకుముందు నిరాకరించియున్నవి.

## "అటమిక్ చదరంగం"

లండన్, ఏప్రిల్ 16: "ఆటమిక్" చతురంగపుటాటను కనిపెట్టిన ట్రాన్స్ జోర్డాన్ ఉపవ్యవసాయమంత్రి, నాసోహీ బేతా హిర్ గారు మే 4వ తేదిని లండన్ లో సమావేశమయ్యే చదరంగపు నిపుణులకు "ఆటమిక్" చదరంగంపై ఉపన్యసిస్తారు.

ఆటమిక్ చదరంగంలో 144 గళ్లు. ఇప్పటి జంతువులకు అదనంగా "టాంకు", "విమానము"నే రెండు క్రొత్త జంతువులు కూడా ఉంటాయి. బంటు అణ్వస్త్రంగా ఉపయోగింపబడుతుంది. ఆటను సాగించగోరేవారు తమ బంట్లను ఈ విధంగా ఉపయోగించరు.

ట్రాన్స్ జోర్డాన్ రాజు అబ్దుల్లాగారు టర్కి అధ్యక్షుడు, ఇనేనూగారితో ఈ రకమైన చదరంగాన్ని ఆడారు. అబ్దుల్లా రాజు ఇనేనూగారికి విలువైన అటమిక్ చదరంగపు బలగాన్ని బహూకరించారు. ఈ క్రొత్తరకం ఆటపై అబ్దుల్లారాజుకు మక్కువ ఎక్కువని తెలుస్తున్నది. ఆయన ప్రతిభ కలిగిన ఆటగాడు.

ఈ ఆటను లండన్ లో 'పేటెంటు' చేయాలని నాసోహీగారు తలుస్తున్నారు. అయితే క్రొత్తరకం బల్లలు లండన్ లో తయారు చేయబడతాయి.—గ్లోబ్.

# బొంబాయి ఆంధ్రమహాసభ శ్రీరామనవమి ఉత్సవాలు

బొంబాయి, ఏప్రిల్ 14: బొంబాయి ఆంధ్రమహాసభ యాజమాన్యాన ఎప్పటివలెనే యీ సంవత్సరంకూడా శ్రీరామనవమి ఉత్సవాలు జరుపబడుతున్నవి. బొంబాయి పార్సీకాలనీలో ప్రత్యేకంగా నిర్మించబడిన పందిరిలో శ్రీ పి. ఎస్. నారాయణ ప్రసాదుగారు ఉత్సవములకు ప్రారంభోత్సవం జరిపిరి. స్థానిక ఆంధ్ర మహాసభ అధ్యక్షులు శ్రీ సోమంచి యజ్ఞన్నశాస్త్రి అధ్వర్యమున జరుగుతున్న యీ ఉత్సవాలను ప్రశంసిస్తూ, నారాయణ ప్రసాదుగారు బొంబాయిలోని ఆంధ్రులందరు కనీసం సంవత్సరానికి ఒక పర్యాయమైనా ఒకచోట కలుసుకొనుట అవసరమనీ, దానికి యీ శ్రీరామనవమి ఉత్సవాలు ఎంతో సహాయపడగలవనీ విశదీకరించారు. పిమ్మట ఆంధ్రమహాసభవారి ఆహ్వానంమీద చెన్నపట్నంనుండివచ్చిన శ్రీ ప్రయాగ నరసింహశాస్త్రిగారు అధ్యాత్మ రామాయణ కీర్తనలు, గీతగోవిందం, తరంగాలు, కడు శ్రావ్యంగా పాడి సభికులను ఆనందపరిచారు. రెండవ రోజున శ్రీ లోవరాజుగారు హిందుస్థానీ పాటలూ, విశ్వజ్యోతికళాసమితి సభ్యులు కొన్ని పాటలు, ప్రయాగ నరసింహశాస్త్రి గారు ఎంకిపాటలు పాడారు. కార్యక్రమం జరుగుతుండగా రాష్ట్రపతి పట్టాభిగారు బొంబాయి మేయరు ఎస్. కె. పాటిల్ వచ్చి కొంతసేపుండి వెళ్ళారు. మూడవనాడు రామారావు పర్వారస్తు గారు జలతరంగిణీ వాద్యము, ప్రయాగ నరసింహశాస్త్రిగారి బుర్రకథా కాలక్షేపము జరిగినవి. నాల్గవదినమందు ప్రయాగ శాస్త్రిగారిచే తెలుగు జానపదగేయాలు, సి. వెంకటేశ్వరరావు, కుమారి కస్తూరి శాంతమోహన్ కుమారి దేవరకొండ ఇందిర గార్లచే శివతాండవనృత్యమూ ప్రదర్శింపబడినాయి. ఐదవరోజున ప్రయాగవారిచే హనుమద్రామ సంగ్రామ హరికథా కాలక్షేపం జరిగింది. శ్రీ ప్రయాగ నరసింహశాస్త్రిగారి కళా ప్రతిభను బొంబాయి ఆంధ్రులు యెంతోమెచ్చుకొనినారు. ఆంధ్రమహాసభవారు ప్రయాగవారి కళా నైపుణ్యాన్ని ప్రశంసిస్తూ ఒక వజ్ర పతకమును బహూకరించారు.

# దివ్యజ్ఞాన పరిషత్సభలు

## శ్రీమతి రుక్మిణీదేవి సందేశం

చెన్నపట్నం, ఏప్రిల్ 17: "నేను దేశమునందన్ని రంగములందునూ అరాచకము కనిపించుచున్నది. వ్యక్తులను, పరిస్థితులను, ప్రభుత్వములనుగూర్చి విపరీత విమర్శలు వచ్చుచున్నవి. ఈ పరిస్థితులు పోయి దేశమునందు సుస్థిరమైన శాంతి నెలకొనగలదని నా విశ్వాసము. దట్టమైన మేఘములు కమ్ముకువచ్చిననూ ఒక మెరపు తళుక్కున గోచరించుచున్నది" అని శ్రీమతి రుక్మిణీదేవిగారు నిన్న సాయంత్రం అడయారులో జరిగిన దక్షిణభారత దివ్యజ్ఞాన పరిషత్సభల సందర్భమున సందేశము నిచ్చుచూ తెలిపిరి. సిడ్నీకుక్ గారు సభాధ్యక్షత వహించిరి.

శ్రీమతి రుక్మిణీదేవిగారిట్లు చెప్పిరి. "దేవుని ఏ రూపమున భావించిననూ, ఏరీతిన ఆరాధించిననూ సర్వ మతబోధన, సకల శృతిసారమూ ఒక్కటే. అందరూ 'లోకాస్సమస్తా సుఖినోభవన్తు' అని చెప్పుదురు, ప్రస్తుతము దేశమున గందరగోళముగా వున్నది. ఈ పరిస్థితి మారకతప్పదు. "సత్యాన్నాస్తి పరో ధర్మః" అని దివ్యజ్ఞానులు తెలుపుచున్నారు. నేను ప్రతివారునూ ధర్మసూత్రములు పఠించువారు, దేశములో సంస్కరణ కావలెననువారే కాని బోధనలను ఆచరణలో పెట్టువారు అరుదైనారు. అందరూ ధర్మసూత్రముల పఠించుటకు బదులు యథాశక్తిని వాటిని నిత్యజీవితములో అనష్ఠించవలెను. మనకు క్రొత్తవిద్యలు, క్రొత్త గ్రంథములు, క్రొత్త బోధలు, క్రొత్త సంస్కరణలు అనవసరము. మన అదృష్టవశమున మనకు అవి పుష్కలముగా వున్నవి. మన జీవితములో నూత్న అధ్యాయము ప్రారంభించుటే మన కర్తవ్యము. రామాయణము, భగవద్గీతకన్న మనకు అమూల్యమైన నిక్షేపము ఏమి కావలెను. రాముని గూర్చి త్యాగరాజు గానముచేసినప్పుడు ఆ సుందర రఘురాముని దివ్యరూపము నే తలచి, తదాత్మ్యముతో తాండవముచేసెను గాని వేరు ప్రపంచము అతనికి అవసరములేక పోయెను. రామాయణ మహాకావ్యమందలి దివ్యామృతమును గ్రోలదలచువారు రాముని కార్యములను తర్కించక ఆ రాముని మనోహర రూపమును దృష్టియందుంచుకొన్నప్పుడే ఆ దివ్యానుభూతి కల్గును. రాముని మరచి ప్రశ్నింప మొదలిడినచో అది 'రామాయణము' అనును కృష్ణుడుకూడా బాలుడై మురళీ గానముతో చేతనా చేతనముల ద్రవింపచేసి తన మనోహర మూర్తిలో లీనముచేసుకొనెను. బుద్ధుడు తన ప్రభావముచే సుజాతకు దివ్యలోకమును ప్రాప్తింపచేసెను. ఈ జగత్తునందు ఏది పవిత్రతపొందినను ఆత్మఅనశ్వరము. ఆత్మవికాసమునకు తగిన వాతావరణము, 'అనుభూతి' సంపన్నము అత్యవసరము. ప్రపంచమంతటిలో భారతావని ఆధ్యాత్మిక విభూతి అపూర్వమైనది. భారతదేశమున ఒక గ్రామమునకు పోయి, జనపదములలోని సామాన్యుల నిలబడిచూచినచో వారిలోని ఉత్తమతత్వము తెలియును. గ్రామమందలి దేవాలయమునకు పోయినచో ఆ ప్రదేశము, వాతావరణము ఆత్మోద్రేకకారక మగును. పతితులైన జనులను ఉద్ధరించుటకు తగిన సాయకత్వము అగత్యమై ఉన్నది. నాయకుడున్నవాడు తను దివ్యానుభూతి పొంది ఇతరులకది బోధించ కలిగి, వారు కూడా అనుభూతిని సాధించగల్గునట్లు చెయ్యవలెను. ఎవరి సాధనో ఇట్టిదని వ్యక్తులు దిగ్భ్రమ చెందక ఎవరికుటుంబు వారు యోచించి, వారి వర్తనముల సంస్కరించుకొని ఉత్తమ పథగాములు కావలెను."

శుక్రవారము పరిషత్సభలు ప్రారంభమైనవి. శనివారం ఉదయం దివ్యజ్ఞాని రామనంద్రరావుగారికి స్మృత్యర్థమై శ్రీ పోమంచి లింగయ్యగారు ఉపన్యాసము చేసిరి. ఉదయం బాలురైన దివ్యజ్ఞానులు కూడి ఆదర్శ దివ్యజ్ఞానిని గూర్చి చర్చించిరి. సాయంత్రం పవిత్రమైన వటవృక్షచ్ఛాయను అల్పాహారము భుజించిరి. రాత్రి ప్రొ. ఆర్. శ్రీనివాసన్ గారు హరికథా కాలక్షేపము చేసిరి.

ఆదివారము ఉదయము దివ్యజ్ఞాన మహితత్వమును గూర్చియు దివ్యజ్ఞానుల కర్తవ్యమునుగూర్చియు ఉప్పులూరి గోపాల కృష్ణమూర్తిగారు ఉపన్యసించిరి. మధ్యాహ్నము అధ్యక్షుల సమాప్తి వచనముతో పరిషత్సభలు ముగిసెను.

## కేసరి ఉన్నత పాఠశాల వార్షికోత్సవం

మైలాపూర్ కేసరి ఉన్నతపాఠశాల వార్షికోత్సవం మంగళవారం సాయంత్రం 6 గంటలకు 16వ రాయపేట హైరోడ్ నందలి కేసరి బాలుర పాఠశాల భవనంలో కౌన్సిల్ అధ్యక్షులు శ్రీ ఆర్. వి. రామకృష్ణారావు అధ్యక్షతన జరుగును.

# న్యాయస్థానముల స్వాతంత్ర్యమును రక్షించుట అవసరం

## నూత్న రాజ్యాంగంలో తగిన నిబంధన లుండాలని భారత ప్రధాన న్యాయమూర్తి హెచ్చరిక

చెన్నపట్నం, ఏప్రిల్ 18: న్యాయస్థానాల స్వాతంత్ర్యం గౌరవింపబడునని రాజకీయవాదులు పలు పర్యాయములు చేసే బహిరంగ ప్రకటనలు వాచారూపములోమాత్రమే నుండక క్రొత్త రాజ్యాంగమునందు ఆచరణలో నంచవమగునని నేను గాఢముగా ఆశిస్తున్నాను" అని భారత ప్రధాన న్యాయమూర్తి సర్ హీరాలాల్ జే. కానియా గారు నిన్న సాయంత్రం మదరాసు అడ్వకేట్ల సంఘం షష్టిపూర్తి మహోత్సవముల ఆఖరురోజు ప్రసంగిస్తూ నుడివిరి.

న్యాయకార్యశాఖల విభజన సమస్య ముఖ్య సూత్రముతో సంబంధించినదిగా నెంచవలెననియు ప్రభుత్వాధికారములో నున్న వ్యక్తులకు సంబంధించేదిగా అనుకొనరాదనియు సర్ కనియాగారు ఉద్ఘాటించిరి.

"భారతదేశ స్వాతంత్ర్యమున్న ప్రజల స్వాతంత్ర్యమని యే అర్థనియు ఆ స్వాతంత్ర్యము నిజముగా నిలువవలెనంటే పౌరులేగాక ప్రభుత్వముకూడా న్యాయశాస్త్రమును గౌరవించవలెను. వయోజన ఓటింగుహక్కు నివ్వబడియుండే అన్ని దేశాలవారి అనుభవం ప్రకారం న్యాయస్థానాలు స్వతంత్రముగా నుండుట అత్యవసరమనే సంగతి నిరూపణ అయియున్నదనిరి.

షష్టిపూర్తి ఉత్సవముల ఆఖరురోజు సభకు మదరాసు గవర్నరు భావనగరుమహారాజా, ప్రధాన న్యా॥ రాజమన్నార్, న్యాయశాఖా మంత్రి శ్రీ కె. మాధవ మీనన్, హైకోర్టు జడ్జీలు న్యాయవాదులు ప్రముఖులు విచ్చేసిరి.

అడ్వకేటు జనరల్ శ్రీ కే. రాజా అయ్యర్ గారు భారత ప్రధాన న్యాయమూర్తిగారికి స్వాగతం మొసగుచూ భారతదేశము స్వాతంత్ర్యం బడసి యున్నందున యిక ప్రివికౌన్సిలు ప్రాధాన్యత ఇంగ్లండు సుప్రీమ్ కోర్టును యుంచగలదనియు ఇండియా దేశం ప్రధాన న్యాయస్థానము ప్రివీకౌన్సిలు ప్రతిష్ఠ గౌరవములు సంపాదించుకొనుటకు న్యాయస్థానాల స్వాతంత్ర్యము గౌరవింపబడవలెననిరి. జ్యుడీషియరి స్వాతంత్ర్యం, కలిగియుండుటకు న్యాయకార్యశాఖల విభజన జరుగుట అవశ్యకమనియు మదరాసు ప్రభుత్వము యీ సమస్యను గూర్చి నివేదించుటకొక కమిటీకి 1935 సం॥లోనే నియమించుట జరిగినప్పటికి విషయము ఆలస్యము చేయబడుచున్నదనియు న్యాయకార్యశాఖల విభజన త్వరలో జరగవలెనని ప్రజలు ఆశించుచున్నారనియు పలికిరి. భారతదేశములో అన్ని ప్రాంతాలందు ఒకే విధమైన శాసనములు అవసరమైనచోట్ల స్థానికమార్పులతో ఆచరణయందుంచ గలిగినట్లు చూడవలెననియు, దేశమంతటికు అఖిలభారత న్యాయవాదసంఘము, రాష్ట్రీయసంఘాల సమాఖ్యగా యుండవలెనని అలాజరిగేపక్షంలో దేశమునందు న్యాయశాస్త్రవిద్యలో ఒకేరీతిగా యోగ్యతలు నిర్ణయించుటకు వృత్తిసంబంధించిన యితర వ్యవహారములు పరిష్కరించుటకు అనుకూలముండుననియు నుడివిరి.

### కనియాగారి ప్రసంగం

భారత ప్రధానన్యాయమూర్తి సర్ కనియాగారు అడ్వకేట్ల సంఘమువారు చేసిన గౌరవమునకు కృతజ్ఞతను తెలుపుతూ యిట్లుపలికిరి.

మదరాసు అడ్వకేట్ల సంఘముయొక్క 60యేండ్ల అనుభవము న్యాయవాదవృత్తిలోనుండే సంఘసభ్యుల అభ్యుదయమునకు ఉపయోగించు కొనవలెననియు న్యాయవాదులు వృత్తిసాగించునప్పుడు తమ అంతరాత్మకు, తమ కక్షిదారులకు, న్యాయస్థానాలకు భయంకరముగా నడుచుకొనకుండా సత్యనిరతిలో వ్యవహరించవలెననిరి.

### దేశానికి ఏకన్యాయవాదసంఘం

భారతదేశమంతటికీ ఏక న్యాయవాద సంఘం ఉండవలెనని అభిలాష సహజమైనదే. వ్యక్తిస్వలాభాపేక్షలు, గ్రక్కలతలు మానగల్గినట్లయితే అంగాపని కష్టము కాజాలదు. రాష్ట్రములలోని న్యాయవాదులందరూ ఏకసంస్థను ఏర్పరచుకొనగల్గితే అఖిలభారతసంఘము ఏర్పడుట సులభసాధ్య మగును.

### న్యాయస్థానాల భాష

ఇండియా దేశము స్వాతంత్ర్యము బడసినప్పటినుండి కోర్టులలో యే భాష వ్యవహారంలో యుండవలెననే ప్రశ్న కలుగుచున్నది. భారతదేశము ఏకముగా నుండవలెనంటే ఏకభాషకూడా దేశానికంతటికీ ఉండవలెను. న్యాయశాస్త్రములు యిన్నాళ్లుగా ఆంగ్లభాషలో నుండియున్నందున చట్టములలోని టెక్నికల్ పదాలకు దేశభాషలో సరియైన సాంకేతిక పదజాలము తయారై న్యాయవాదులు క్రొత్త భాషలో వాదనలు గావించుటకు కొంత కష్టముకలుగును. ఈ మార్పు నిర్దేశించేయుటకు దేశములో సామాన్య భాషయందు యీ న్యాయశాస్త్ర విద్యను గరపుటకు విద్యా సంస్థలలో మొదట ప్రారంభించవలెను. అట్టి భాషామార్పు ఒకరోజులో జరిగేదికాదు.

### భాషాప్రయుక్త విభజన

భాషా ప్రయుక్త రాష్ట్రవిభజన జరుగవలెనని రాజకీయవేత్తల ఆందోళనం జరుగుచున్నది. అధికార సంపాదనాపేక్షపాలకులకు యీ ఆందోళనము సాగుటకు కారణమైయున్నది. మదరాసు రాష్ట్రము చాలా కాలమునుండి ఏకరాష్ట్రముగా పాలింపబడుచున్నది. ప్రత్యేక ప్రాంతాలవారు తమ సంస్కృతి విజ్ఞానము అనుగుణ్యముగా తమ ప్రాంతాలను అభివృద్ధి పరచుకొనవలెనను విషయంలో ఎవరూ తప్పు పట్టలేరు. కాని చిన్న చిన్న రాష్ట్రాలు ఏర్పాటు కావలసియున్నపుడు వాటికి కావలసిన క్రొత్త గవర్నరులు మంత్రులు తదితర సిబ్బందికై విశేషధనము వెచ్చించవలసి యుండును. అట్టి చిన్న రాష్ట్రములలో ప్రత్యేక హైకోర్టుల నిర్వహణకు పట్టే భారీ ఖర్చులను యీ రాష్ట్రములు భరింపలేని స్థితిలో నుండవచ్చును. అందువల్ల యీ విధముగా చిన్న రాష్ట్రాల విభజన మంచిదికాదు.

### న్యాయకార్యశాఖల విభజన

దేశంలో పౌరస్వాతంత్ర్యము సరిగా రక్షింపబడుటకు స్వతంత్రతకల న్యాయస్థానము లుండవలెను. అందుకు న్యాయస్థానములతో ఎగ్జిక్యూటివు అధికారుల కేలాటి సంబంధము ఉండకుండా చేయుటకు న్యాయ కార్యశాఖల విభజన జరుగవలెను. ప్రజల స్వాతంత్ర్యము రక్షించుటకు ప్రభుత్వములు యీ సంస్కరణను ఏమాత్రము ఆలస్యముచేయరాదు.

భారతదేశములో అన్ని ప్రధానస్థానాలందు న్యాయవాదులే పేరు ప్రతిష్టలు గాంచియున్నారనియు దేశమును దాస్యవిముక్తిచేసిన మహాత్ముడుకూడా న్యాయవాదియే యనియు, న్యాయవాదులు అట్టి ఆదర్శప్రాయుడైన మహనీయుని అడుగుజాడలను అనుసరించుటకు ప్రయత్నించవలెననియు సర్ కానియాగారు కోరిరి. శ్రీ టి. వెంకట్రామయ్యర్ గారు వందనము లర్పించిన తర్వాత వినోదప్రదర్శనములు, విందు అయినమీదట ఉత్సవముల కార్యక్రమము పరిసమాప్తికి వచ్చెను.

### సి. పి. రామస్వామి అయ్యర్ ప్రసంగము

మదరాసు, ఏప్రిల్ 17: విశేషసంఖ్యాబలమునుండే పార్టీ పరిపాలనగల ప్రజాస్వామ్యము నియంతృత్వ పరిపాలనముగా మారే అపాయమున్నది. ఇండియా లోగాని ఇతర దేశాలలో ప్రజాస్వామ్య పరిపాలన విజయవంతము కావాలంటే ప్రతిపక్షములను నిర్లక్ష్యము చేసే భావము వదలవలెను. ఎదిరి పక్షముల అభిప్రాయములను తెలిసికొనుచూ వ్యవహరించుట అత్యంత అవసరము. స్వతంత్ర భారతదేశములో ఎదిరివాదము వినవలెననే సంగతిని న్యాయవాదులు ముఖ్యముగా నిరూపించవలెను అని సర్ సి. పి. రామస్వామి అయ్యర్ గారు నిన్న సాయంత్రం మదరాసు అడ్వకేట్ల సంఘ షష్టిపూర్తి మహోత్సవముల రెండవరోజు ప్రసంగమొసగుచూ నుడివిరి.

న్యాయమూర్తులు, అనేకమంది న్యాయవాదులు తదితర ప్రముఖులు సభ నలంకరించిరి.

ప్రార్థనానంతరము శ్రీ ముత్తుకృష్ణయ్యర్ గారు, సర్ సి. పి. రామస్వామి అయ్యర్ గారిని ప్రస్తుతించుచూ కొన్నియేండ్లక్రితం పి. పి. మదరాసు అడ్వకేట్ల సంఘానికి జూనియర్ న్యాయవాదుల సహాయ నిమిత్తం రూ. 35000 విరాళమిచ్చిరనియు, సర్ సి. పి. గారు ఉద్దండ న్యాయవాదియై అడ్వకేట్ల సంఘములో అనేకయేండ్లు సభ్యులుగాకూడా నుండిరనియు పలికిరి.

సర్ సి. పి. రామస్వామిగారు సంఘసభ్యులు తనకు ఒసగిన గౌరవమునకు కృతజ్ఞతను తెలుపుచూ మదరాసు న్యాయవాదులు విశేష ప్రతిభానంతులనే ఖ్యాతి యున్నదనియు, ప్రపంచములో ఏ దిశను వారు తీసిపోరనియు పలికిరి.

ప్రధాన న్యాయమూర్తి శ్రీ రాజమన్నారుగారు సూచించినట్లు న్యాయవాద సంఘసభ్యులు న్యాయశాస్త్ర విజ్ఞాన సముపార్జన విషయమై విశేషశ్రద్ధ వహించుట అవసరమని సర్ సి. పి. గారు నుడివిరి. ప్రస్తుత శాసనములు భాషాయి మునుపటి శాస్త్రములలో నుండినవాటికి చాలా భిన్నములైనవి. ప్రజాజీవితమునకు సంబంధించిన యే స్వల్పవ్యవహారములోకూడా ప్రభుత్వమునకు సంబంధ మేర్పడుచున్నది. ఇట్టి పరిస్థితివల్ల పలు క్లిష్ట సమస్యలు ఉద్భవించుచున్నవి.

ప్రజాప్రభుత్వము ప్రతివిషయములలో కలుగజేసుకొనుచున్న సందర్భములలో తమ అధికారబలమునకు అడ్డు లేదనే భావముమీద ఆధారపడకుండా ఎదిరి వాదనలను అభిప్రాయాలనుకూడా విని పాలించుటకు ప్రయత్నించుట అవశ్యకమనిరి. అలా ఎదిరివాదన నిర్లక్ష్యముచేస్తే ప్రజాస్వామ్యములు నియంతృత్వములవలె పరిణమించగలవనిరి. ఉభయపక్షముల వాదనలను వినవలెనని చెప్పుటసులభము. కాని ఆ విధముగ విని నడుచుకోవటం కష్టం. ప్రభుత్వము ఎదిరి వాదనలు విని నంతమాత్రం చాలదు. ఆ విధముగా వ్యవహరించుటయే ముఖ్యమని సర్ రామస్వామి అయ్యర్ గారు ప్రసంగమును ముగించిరి.

ఆనంతరం శ్రీ వి. రాధాకృష్ణయ్యగారు మదరాసు అడ్వకేట్ల సంఘాధ్యక్షుడు శ్రీ వి.వి. శ్రీనివాస అయ్యంగారు న్యాయవాదవృత్తి ప్రారంభించి ఈ నాటికి 51 ఏండ్లు కావచ్చినందుకు వారికి గౌరవ పురస్కరముగా సన్మానపత్రము నొకదానిని రజితపేటికలో పెట్టి సంఘము తరపున సమర్పించిరి.

శ్రీ వి. వి. శ్రీనివాసయ్యంగారు అభినందనములకు ఉచితరీతిని ప్రత్యుత్తర మొసగిరి. తర్వాత గిరుగ శిక్కా జీ సరస్వతి గానవిలయం విద్యార్థుల నృత్యప్రదర్శనముతో కార్యక్రమము ముగిసెను.

# ప్రస్తుత శాసన నిర్మాణ విధానము

## ఒరిస్సా ప్రధాన న్యాయమూర్తి విమర్శ

(ఆంధ్రపత్రిక విలేఖరి)

బరంపురము, ఏప్రిల్ 16: త్వరత్వరగా శాసనములు చేయు విధానమును, అసమగ్రముగా, ఖండఖండములుగా శాసనములు చేయుపద్ధతిని నేడు ఒరిస్సా హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ బి. కే. రేగారు ద్వితీయ ఒరిస్సా న్యాయవాదులసభలో విమర్శించిరి. ఈ పద్ధతి అనేక అవకతవకలకు కారణమగుచున్నదని ఆయన చెప్పెను.

సభకు శ్రీ బోధారామ్ దూబా గారు అధ్యక్షత వహించిరి.

ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ గాదె నారాయణమూర్తిగారు ఎమ్. ఎల్. ఏ. ఒరిస్సా అంతటినుండియు వచ్చిన న్యాయవాదులను ఆహ్వానించుచు న్యాయవాదవృత్తి ప్రతిష్ఠ తగ్గెనని, తిరిగి న్యాయవాదవృత్తికి ప్రతిష్ఠచేకూర్చవలెనని, ప్రతిష్ఠతగ్గుటకు న్యాయవాదులే కారణమని చెప్పిరి. న్యాయశాఖను కార్యశాఖనుండి వేరుచేయువిషయమై ప్రస్తావించుచు ప్రభుత్వమువారు ఈసిద్ధాంతమును అంగీకరించిరి గాని దానిని అమలు చేయలేదనిరి.

### ప్రధాన న్యాయమూర్తి అభిభాషణ

ప్రధాన న్యాయమూర్తి శ్రీ బి. కె. రేగారు సభను ప్రారంభించుచు న్యాయవాదుల మహాసభ జరపవలెనని తాను 1948 సం॥లో సూచించెననీ, ఆసూచనను న్యాయవాదులు ఉత్సాహముతో చేపట్టిరనిరి. ఈమహాసభను ఏర్పరచుటకు తాను గావించిన కృషిని ప్రధాన న్యాయమూర్తి వివరించి త్వరత్వరగాను, అసమగ్రముగాను శాసనములుచేయు ప్రభుత్వ వైఖరి అనేక అవకతవకలకు ఆస్పదమగుచున్నదనిరి. న్యాయవాదుల సంస్థలు నిర్మాణాత్మకమగువిమర్శలు గావించవలెననిరి. ఒకానొక రాష్ట్రములో న్యాయవాదులుగానున్నవారు ఆ రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తులుగా నియమింపబడరాదని గత సంవత్సరపు సభలో గవర్నరు అనఫాలి వెలిబుచ్చిన అభిప్రాయముతో రేగారు భేదించిరి. ఇట్టి నియామకములను ఆయన సమర్థించిరి.

బార్ కౌన్సిలు ఒకటే యుండవలసిన ఆవశ్యకతను, న్యాయవాదుల దుష్ప్రవర్తనను బార్ కౌన్సిల్ దృష్టికి తీసికొనిరావలసిన ఆవశ్యకతను రేగారు నొక్కి చెప్పిరి. ఒరిస్సా హైకోర్టు నిర్భయముగా న్యాయం ప్రసాదించునట్లు, న్యాయవాదులకును న్యాయమూర్తులకును సంబంధములు సహజముగా నుండునట్లును చేయ తాను సర్వప్రయత్నములూ గావించునని న్యాయవాదుల నైతిక ప్రమాణములు ఉన్నతముగా నుండవలెనని ఉద్బోధించిరి. న్యాయవాదుల ఆర్థికస్థితిని బాగుచేయవలెననిరి. న్యాయశాస్త్రమునకు సంబంధించిన ప్రచురణలను ప్రతివారము ప్రచురించుటకు ఒక సహకార పరపతిసంఘము నేర్పరుపవలెననిరి. ఇట్టి ప్రచురణలు న్యాయవాదులకును న్యాయమూర్తులకును అత్యంతోపయుక్తముగా నుండగలవనిరి.

కాంచీపురం, ఏప్రిల్ 10: కాంచీపురానికు ఉత్తరంగా 300 మైళ్ళ దూరంలో ఉన్న ఒకలీగ్రామంలో నేటి సాయంత్రం భూమి తీవ్రంగా కంపించినది. ప్రాణనష్టమేమీ కలిగినట్లు లేదు.

# "కామన్వెల్తులో ఉన్నచో తాటస్థ్యము మిథ్య"

## ప్రభుత్వ నాయకులపై అరుణాఆసఫాలీ విమర్శ

కాన్పూరు, ఏప్రిలు 17: యు. పి. దుకాణగుమాస్తాల సమావేశానికి అధ్యక్షత వహించడానికి నేటి ఉదయం యిక్కడికి విచ్చేసిన శ్రీమతి అరుణా అసఫాలీ, పత్రికావిలేఖరులతో ప్రసంగిస్తూ యీ విధంగా చెప్పారు.

"ఇండియా రిపబ్లికనీ, కామన్వెల్తులోనే ఉంటామనీ, ఏ దేశంమీదికి యుద్ధానికి పోమనీ ఒకేసారి చెప్పడం అసందర్భం. ఇండియా కామన్వెల్తులో ఉండడము తథ్యమనే భావించవచ్చు. పండిట్ నెహ్రూ తిరిగిరాగానే రాజ్యాంగసభ వారు ఈ నిర్ణయాన్ని బలపరుస్తారు. కాని ఇండియా కామన్వెల్తులో చేరియున్నంత కాలమూ తటస్థంగా ఉండటం గాని, ఆసియారాజ్యాలకు నాయకత్వం వహించడముగాని కేవలము మిథ్య. మననాయకులు విదేశీ పెట్టుబడుల నాహ్వానించి బ్రిటిషు అమెరికను సమాఖ్యలో చేరిపోతూనే, యుద్ధం వస్తే తటస్థంగా వుంటామని పైకి చెబుతున్నారు. ఇండియాలో విదేశీ పెట్టుబడులు హెచ్చినట్లయితే ఇండియా ఆర్థిక వ్యవస్థ పాశ్చాత్యదేశాలతో ముడిపడి, రాజకీయంగా వారి పెత్తనం చలాయించ గలదని నా విశ్వాసం.

"ఇండియాలోని కమ్యూనిస్టులపై అట్లాంటిక్ ఒడంబడిక ప్రభావం కంటె చైనా విప్లవప్రభావం జాస్తిగా కనిపిస్తున్నది. చైనా విప్లవం, 1917లో రష్యా విప్లవంలాగే,చాలా ముఖ్యమైనది ఇండియా ప్రభుత్వంవారు కమ్యూనిస్టులపట్ల తమ వైఖరిని అమెరికను ప్రభుత్వవైఖరికి అనుగుణంగా ఉంచుతున్నారు."

దుకాణ గుమాస్తాల సమావేశంలో ఉపన్యసించుతూ శ్రీమతి అరుణా అసఫాలీ, సోషలిస్టు వ్యవస్థ ఏర్పడాలనీ, సాయుధ విప్లవం కావాలనీ, ప్రజలు తమ హక్కులను వినియోగించి ప్రభుత్వాన్ని మార్చి సోషలిస్టు వ్యవస్థ సాధించవచ్చుననీ, దేశ సంపద కొద్దిమంది చేతులలోనే ఉన్నదనీ సోషలిస్టులు అధికారంలోకివస్తే పెట్టుబడిదార్ల సంపదను స్వాధీనం చేసుకోగలరనీ చెప్పారు.

# సోమవరప్పాడులో పోలీసు కాల్పుల సంఘటన వివరాలు

నెల్లూరు, ఏప్రిల్ 18: సోమవరప్పాడులో జరిగిన పోలీసు కాల్పుల విషయమై ఈదిగువ వివరాలు తెలిసాయి: గోవింద ఉత్సవం సందర్భంలో కొన్ని పోటీ పందెములు జరుగుతాయి. వాటిల్లో,ఎడ్లచే బరువయిన రాళ్ళు లాగించడం ఒకటి. మొన్న ఈపందెం జరుగుతుండగా పోలీసులు ప్రజా సమూహాన్ని చెదరగొట్టడంలో ఒకరికి లాఠీదెబ్బ తగిలిందట. దానితో జనం కోపోద్రేకంతో పోలీసు [illegible] వీరికి పోయి, సబ్ ఇన్స్పెక్టరు, పోలీసులను, [illegible] స్పెక్టరు, [illegible] కొట్టి, వారందరి చేతికి నిన్న అంటించారట. స్థితిగతులు స్వాధీనం తప్పినందున పోలీసులు కాల్పులు జరిపారట. ఒకతను చనిపోవడం, కొందరు గాయపడడం జరిగింది. ఈసంగతి తెలియడంతోనే జిల్లామేజిస్ట్రేటు, డి. ఎస్. పి. ఆగ్రామం వెళ్ళారు. ఆ గ్రామానికి పోలీసు కాపలా కాస్తున్నారు. స్వ.వి.

# సి. ఐ. డి. శాఖలో కమ్యూనిస్టులు

## ఇరువురుఉద్యోగుల అరెస్టు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 17: న్యూఢిల్లీలోని సి. ఐ. డి. సూపరింటెండెంటు, రిఫీకేన్ గారు భారతప్రభుత్వ గూఢచారిశాఖకు చెందిన ఇరువురు ఉద్యోగులను అరెస్టు చేసారు.

వీరి నిర్బంధం పంజాబు ప్రజారక్షణ చట్టాన్ననుసరించి జరిగింది. గూఢచారి విభాగంలో గుమాస్తాలుగా పనిచేస్తున్న వీరిరువురు రహస్యంగా కమ్యూనిస్టుపార్టీలను జరుపుచున్నారట. వీరిద్దరు కమ్యూనిస్టు సాహిత్యం లక్షించిందట —గ్లోబ్

# ఎమ్. ఎస్. ఆనేగారు

[illegible], ఏప్రిల్ 17: [illegible] గవర్నరు ఎమ్. ఎస్. ఆనేగారి గౌరవార్థం నేటిక్కడ ఒక విందు ఏర్పాటుచేయబడెను. విందుకు వచ్చిన అతిథులు [illegible] శాసనము సమర్పించిన దానికన్న [illegible]ముగా సంకుటదేశ ఆనేగారు విందులో పాల్గొనకుండా, వచ్చినవారు వచ్చి[illegible] గా యింటికి వెడలిపోయిరి. [illegible] జన కమీషనరు, జిల్లాజడ్జి, తదితరఉద్యోగులుకూడా విందులో [illegible] మరలిపోయిరి.

## నోటీసు

1945 మద్రాసు సిటీ యింప్రూమెంటు ట్రస్టు అక్టు 47 వ సెక్షన్ క్రింద నోటీసు.

ఇందు మూలమున తెలియపరచున దేమనగా, దిగువ దాఖలా షెడ్యూలులోని సరిహద్దుల లోపలనున్న ఏరియాకు, మద్రాసు సిటీ యింప్రూవెంటుయొక్క ట్రస్టీలబోర్డువారు యింప్రూమెంటు స్కీమును తయారుచేసి యున్నారు.

2 దిగువ డాక్యుమెంట్లతోసహా, స్కీము తాలూకు వివరములన్నియు, మద్రాసు, నెం 160 రు మౌంట్‌రోడ్‌నందలి బోర్డు ఆఫీసునందు ఆఫీసు రోజులలో యెప్పుడైనను ఉ॥ 11 గం. లు మొదలు సా॥ 5 గం ల వరకు, ఉచితముగా చూడవచ్చును

(a) స్కీముయొక్క డ్రాఫ్టు క్లాజులు
(b) స్కీములో చేరిన ఏరియా మ్యాపు (ప్లాన్ నెం. 1)
(c) ఏరియా లేఔటు (ప్లాన్ నెం. 2)
(d) ఉద్దేశించిన బిల్డింగుల ప్లానులు (ప్లానులు, 3,4)

పై 2 వ పేరా a మొదలు d వరకుగల అయిటములో తెలిపిన స్కీము నిర్మాణము యొక్క డాక్యుమెంట్ల కాపీలు, రు 2/-లు (రెండు రూపాయలు మాత్రం) చెల్లించి, ఛేర్మన్‌గారి వద్దనుండి పొందవచ్చును.

స్కీములోనున్న ప్రపోజలుకు ఏవైన ఆక్షేపణలున్న యెడల, బోర్డు ఛేర్మన్‌గారికి 10-6-49 లోపున వ్రాతమూలకముగా పంపుకొనవలెను.

షెడ్యూలు:

ఏరియాకు హద్దులు:

| | |
|---|---|
| ఉత్తరం | జార్జిటౌన్ ఆర్. ఎస్. నెం. 11379/1, 11712 భాగము |
| తూర్పు | ఆర్. ఎస్. నెం. 11712 జార్జిటౌన్, భాగము (హైకోర్టుకాంపౌండు) |
| దక్షిణం | ప్రేసన్సు బ్రిడ్జిరోడు (ఆర్. ఎస్. నెం. 11718, జార్జిటౌన్ 10120 భాగము) |
| పడమర | ఎస్ప్లనేడ్ రోడు, (ఆర్. ఎస్. నెం. 11379 జార్జిటౌన్ భాగము) |

మద్రాసు సిటీ యింప్రూమెంటు ట్రస్టీల బోర్డు తరఫున, నాచే ఈ 1949 ఏప్రిల్ 2 వ తేదీన జారిచేయబడినది.

మద్రాసు
2-4-49
కే. కే. నంబియార్,
బోర్డు ఛేర్మన్.



## మాతృభాషద్వారా విద్యాబోధన

### రాజా ధోండ్‌రాజ్ హామీ

హైద్రాబాదు, ఏప్రిల్ 15: ఈ సంవత్సరం జూన్‌నుంచే లోయర్ సెకండరీ తరగతులలో మాతృభాషద్వారా విద్య గరపవలెనని హైద్రాబాదు ప్రభుత్వం గట్టిగా నిర్ణయించినదనీ, ఈ నిర్ణయం ఇంత త్వరలో అమలుజరగచేసికొనని సంశయించ నవసరంలేదనీ, హైద్రాబాదు ప్రభుత్వ విద్యాశాఖాసభ్యుడు శ్రీ రాజా ధోండ్‌రాజ్ కట్టల్మండీలో ఆంధ్ర విద్యాలయ హైస్కూలు వార్షికోత్సవ సందర్భంలో అధ్యక్షోపన్యాసంచేస్తూ హామీ ఇచ్చిరి. ప్రభుత్వం సాధకబాధకాలన్నీ సావధానంగా విచారించినమీదనే ఈ నిర్ణయానికి వచ్చిందనీ, కావలసిన ఏర్పాట్లన్నీ చేయుడానికి జూన్‌వరకూవున్న వ్యవధి చాలుననీ, రాజాధోండ్‌గారు అనిరి. సంస్థానంలో అంతటాకలిసి మిడిల్ స్కూళ్ళలో 700 మంది తెలుగు తెలిసిన అధ్యాపకులు వున్నారనీ, 700 మంది మరాఠీ తెలిసినవారు 150 మంది కన్నడంవారుకూడా వున్నారనీ, స్కూలుకు 5 మంది అధ్యాపకులు చొప్పున కావలెననుకుంటే, సంస్థానంలో వున్న 150 స్కూళ్ళకు కలసి 750 మంది అధ్యాపకులు కన్న అవసరం లేదనీ రాజాగారు సుడివిరి. ఆంధ్ర విద్యాలయం మానేజింగు బోర్డు కరెస్పాండెంటు అయిన కె. కోటీశ్వరరావుగారు తెలుగు బోధనాభాషగా చెయ్యడానికి తాము ఇదివరకు పడ్డ యాతనలు వర్ణించిరి. నూతన ప్రభుత్వం వచ్చి పరిస్థితులు బాగుపడ్డందుకు సంతసము వెలిబుచ్చిరి. అనంతరం రాజా సాహెబ్‌గారు విద్యార్థులకు బహుమతులను పంచిపెట్టిరి. స్వాగతోపన్యాసానికి సమాధాన మిచ్చుచూ ప్రజల వితరణ సహాకారములేకుండా సంస్థానంలో అవిద్యను నిర్మూలించడం సాధ్యంకాదనీ, ప్రజలు ప్రభుత్వంతో తగిన విధంగా సహకరించగలరని ఆశించుచున్నామనీ చెప్పిరి. అనంతరం విద్యార్థులు వినోద ప్రదర్శనములు జరిపిరి. సమావేశమునకు మాడపాటి హనుమంతరావు ప్రభృతులు హాజరైరి.

## పబ్లిక్‌వర్క్సు వర్క్సు శాఖ ఉద్యోగుల సమ్మె నోటీసు

హైదరాబాదు, ఏప్రిల్ 18: హైద్రాబాదులోని పబ్లిక్‌వర్క్సుశాఖ వర్కుషాపులోని దాదాపు 600 మంది ఉద్యోగులు రేపు వర్కుషాపు అధికార్లకు 21 రోజుల సమ్మె నోటీసు అందజేయుటకు నిర్ణయించారు. ప్రతి ఉద్యోగికీ కనీసజీతం రు 40 లు. కరువు భత్యం రు 50 లు. యివ్వాలని వీరు కోరుచున్నారు. వర్కుషాపులో టెంపరరీ ఉద్యోగులుగా తీసుకోబడిన 150 మందిని పర్మనెంటు చేయవలెనని కూడ వీరు కోరుతున్నారు.

# హైదరాబాదు ప్రజలపట్ల ప్రభుత్వ సవతితల్లి ప్రేమ

## డా॥ జి. ఎస్. మేల్కోట్ తీవ్ర హెచ్చరిక

హైదరాబాద్, ఏప్రిల్ 17: "ప్రస్తుత సంస్థాన ప్రభుత్వము, యూనియన్ అధికార్లు, హైదరాబాద్ ప్రజలను జయింపబడిన దేశంలోని ప్రజల మాదిరిగా చూడటాన్ని యింకానూ సాగించేయెడల 'హైదరాబాదు హైదరాబాదీయులకు, మాత్రమే' అన్న నినాదాన్ని మేము లేవదీయవలసి వచ్చును." అని సంస్థాన కాంగ్రెస్ కార్యవర్గ సభ్యుడు జి. ఎస్. మేల్కోట్ గారు నేటి సాయంకాలం విద్యార్థుల సమావేశంలో ప్రసంగిస్తూ హెచ్చరిక చేశారు.

ప్రభుత్వంలో ఉద్యోగాలిచ్చు విషయంలో ఉస్మానియా విశ్వవిద్యాలయ పట్టభద్రులపట్ల ప్రస్తుత ప్రభుత్వం చూపుతున్న సవతితల్లిప్రేమను మేల్కోట్‌గారు తీవ్రంగా ఖండించారు.

"గత ఫాసిస్టు ప్రభుత్వమున కెదురొత్తుగా మనం పోరాటంసల్పింది పెనంమీద నుండి నిప్పులోకి పడటానికిగాదు." అని ఆయన చెప్పారు.

# నైజాం రేడియోలో తెనుగు కాలక్షేపాలు

## మే 1 తేదీ నుండి మార్పు

హైదరాబాదు, ఏప్రిలు 16: ఇండియా గవర్నమెంటు ఉత్తరువునుసరించి నేటి నుండియు హైదరాబాదు రేడియోద్వారా బ్రిటిష్ బ్రాడ్‌కాస్టు వార్తల ప్రసారము నిలిపివేయడమైనది. మే నెల 1 తేదీనుండి హైదరాబాదురేడియో ప్రోగ్రాములందు చాలా మార్పులురాగలవు. అప్పుడు తెనుగులో కాలక్షేపములు ఎక్కువ ప్రాధాన్యము వహించును. ప్రస్తుతము వివిధభాషలలో జరిగెడి కాలక్షేపముల కన్నింటికి వినియోగమయ్యెడి మొత్తము కాలములో నాలుగోవంతు కాలముమాత్రమే తెనుగు కాలక్షేపమునకు వినియోగ మగుచున్నది. ఉర్దూ కాలక్షేపములకు సగముకాలము వినియోగమగుచున్నది. ఇకముందు నుండియు హిందుస్తానీ ప్రోగ్రాములకు వినియోగమైనంత కాలము తెనుగు ప్రోగ్రాములకు వినియోగమగును. తెలుగు, ఇంగ్లీషు హిందూస్తానీ భాషలలో వార్తావళి ప్రసారము చేయుట నిలిపివేయబడును. దానికిబదులు స్థానిక వార్తలు ఏవైనా ఉంటే ప్రకటింపబడును.

ఔరంగాబాదు రేడియో స్టేషనునందు మరాటీ ప్రోగ్రాములకు ప్రాధాన్య ము సంగబడును. తెనుగు నాటకములకు సంగీతమునకు రికార్డుల సంగీతమునకు ఎక్కువ కాలము ప్రత్యేకింపబడును. లాయఖాలీ మంత్రిత్వకాలములో మధ్య ప్రాచ్యములోని మహమ్మదీయ రాజ్యములకు కూడా హైదరాబాదువార్తలు వినబడునట్లుగా 31 మీటర్లుమీదను 49మీటర్లమీదను వార్తా ప్రసారం జరుగుచూ ఉండేది. అరబం, గుజరాతీ, అరబ్బీ, పరిషియను, పుష్టు భాషలలో వార్తలు చెప్పబడుచుండెను. ఈ భాషలలో ప్రసారము ఆ మీటర్లలో ప్రసారం ఆపివేయబడినది.

రేడియో ప్రోగ్రాములను ప్రజారంజకంగా చేయవలెను. రేడియో కంట్రోలరుగు లూథరుగారు కృషిచేయుచున్నారు.

### ఉస్మానియా విశ్వవిద్యాలయ కొత్త కాలేజీలు

సంస్థానంలోని ప్రయివేటు కాలేజీలు కొన్నిమరకు నియమములకు లోబడి ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు అనుబంధింపబడునని ఆర్యసమాజ నాయకులగు దత్తాత్రేయ ప్రసాదుగారు అడిగిన ప్రశ్నకు సమాధానంగా మేజరు జనరలుచౌదరిగారు (హైదరాబాదు గవర్నరు) తెలియజేసిరి.

### కమ్యూనిస్టులకు ఆయుధాలసప్లయి

హైదరాబాదు సంస్థానంలోని కమ్యూనిస్టులకు ఆయుధములను మందుసామగ్రిని రహస్యంగా అమ్ముచున్నటువంటి ఐదుగురు మహమ్మదీయులు అరెస్టు చేయబడిరి. దరియాప్తు జరుగుచున్నది.

### డి. పి. డబ్లియు పనివాండ్ల సమ్మె నోటీసు

హైదరాబాదులోని ఎలెక్ట్రిసిటీ డిపార్టుమెంటులోని పనివాండ్లు తమకు జీత ప్రమాణములు చాలవనియు, కరవు భత్యములు చాలవనియు, సమ్మె చేయ తలంచితిమనియు, 21 రోజులు ముందుగా నోటీసు యివ్వవలెననియు తీర్మానించిరి. అదేవిధంగా డి. పి. డబ్లియు పనివాండ్లు 600 మంది సమ్మె నోటీసు యిచ్చుటకు తీర్మానించిరి. ఈ రెండు కార్మిక సంఘములకు ప్రెసిడెంటును బి. యస్. మహాదేవసింగుగారు హైదరాబాదు ఛీఫ్ సివిల్ అడ్మినిస్ట్రేటరగు డి. యస్. బాక్లేగారితో మాట్లాడిరి. ఆరుమాసాల వరకు కార్మిక వివాదములను తాత్కాలికంగా విరమించవలెనని బాక్లేగారు కోరిరి. కాని అంత కాలంవరకు ఆగియుండుటకు వీలులేదని బాక్లేగారు చెప్పిరి. కార్మికులస్థితి చాలా దుర్భరంగా ఉన్నదనియు, వారికి వెంటనే పరిహారం కల్పించవలెననియు, మహదేవసింగుగారు చెప్పిరి. కాని, కార్మిక సంఘపు కోరికలను వెంటనే మంజూరు చేయజాలమని బాక్లేగారనిరి

## హైద్రాబాద్ మునిసిపల్ కార్పొరేషన్ పునర్నిర్మాణం

హైద్రాబాద్, ఏప్రిల్ 17: హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్, నిజమైన అర్థంలో ప్రజా ప్రతినిధులతో కూడిన సంస్థగా సుండునట్లు పునర్నిర్మాణం చేయబడినదని తెలుస్తోంది. మునిసిపల్ కార్పొరేషన్ ఎన్నికలు జరపటం ప్రస్తుతం సాధ్యంకాదు కాబట్టి, కార్పొరేషన్ కార్యకలాపాలలో శ్రద్ధ తీసుకోగలిగా ఉన్న సభ్యుల స్థానే ప్రజాసేవాతత్పరులైన వారిని నియమించటం జరిగిందని కూడ తెలుస్తోంది.

# హైద్రాబాదులోని 24 ప్రధాన పట్టణాలకు వైర్లెస్ సౌకర్యం

## తంతిశాఖ డైరెక్టర్ ప్రకటన

ఔరంగాబాద్, ఏప్రిల్ 17: సంస్థానంలో ముఖ్యపట్నానికి 24 వాణిజ్య కేంద్రాలు, జిల్లా ప్రధాన కేంద్రాలకు మధ్య వైర్‌లెస్ సౌకర్యాలు ఏర్పాటు చేయటానికి హైదరాబాద్ ప్రభుత్వం ఒక పథకం తయారుచేసింది. హైదరాబాద్‌లోని తంతి సౌకర్యాలశాఖ డైరెక్టరు మహాలింగంగారు ఈ విషయాన్ని వెల్లడిచేస్తూ, హిందూదేశంలో యిటువంటి దానికి (అంటే కొద్ది దూరంలో గల పట్నాలలో ట్రంకు ఫోను సౌకర్యాలకు బదులు వైర్‌లెస్ స్టేషన్లను ఏర్పాటు చేయటం) యిదే ప్రథమ ప్రయత్నమనిరి. చాలకొద్ది దూరంలో గల పట్నములలో వైర్‌లెస్ స్టేషన్లను ఏర్పాటు చేయటానికి వచ్చే ప్రతిబంధకాలను అధునాతన శాస్త్ర పద్ధతివలన అధిగమించవచ్చునని ఆయన తెలియజేసెను. ట్రంకు టెలిఫోను తీగలు తుపానుతాకిడికిగాని, దుండగుల అకృత్యాలఫలితంగాగాని పాడైపోవచ్చునుగాని వైర్‌లెస్ స్టేషన్లను ఏర్పాటు చేసినప్పుడు అటువంటి పరిస్థితులేమీ ఏర్పడవని కూడ ఆయన తెలియజేసెను. హైదరాబాద్ ప్రభుత్వం యీ స్టేషన్ల ఏర్పాటుకు మొత్తం పదిన్నర లక్షల రూపాయలను ప్రత్యేకించింది. ఔరంగాబాద్‌లోని వైర్‌లెస్ స్టేషను మేనెల మొదటివారంలోగాని రెండో వారంలోగాని పనిచేయుట ప్రారంభించునని ఆయన వివరించెను.

## శ్రీ భ్రమరాంబ, చన్నమల్లేశ్వరస్వామి కల్యాణోత్సవాలు

యలమర్రు, ఏప్రిల్ 17: స్థానిక శ్రీ భ్రమరాంబ చన్నమల్లేశ్వర దేవస్థానంలో ఈ నెల 23నుండి 27వరకు శ్రీమత్ భ్రమరాంబా చన్నమల్లేశ్వరస్వామివారి కల్యాణోత్సవాలు జరుపబడును. ప్రతి రోజు ఉదయము, రాత్రి కాలములందు హరికథా కాలక్షేపములు ఏర్పాటు చేయబడినవి.

## రాష్ట్రంలో బియ్యం నిల్వ

మదరాసు, ఏప్రిల్ 17: చెన్న రాజధానిలో ఏప్రిల్ 10 న 5,02,672 టన్నుల బియ్యం నిల్వయున్నదని ప్రకటించబడినది. ఇదే వారములో ధాన్య సేకరణ 14,531 టన్నులు తగ్గినది.

నగరములో ఏప్రిల్ 14 న 14,610 టన్నుల బియ్యం నిల్వవున్నవి. నగరమునకు 47 దినములకు సరిపడు గ్రాసము వున్నది.

# హైద్రాబాదులో భూములు అమ్ముతున్న జాగీర్దార్లకు హెచ్చరిక

హైదరాబాద్, ఏప్రిల్ 17: హైదరాబాద్ ప్రభుత్వం యీ కింది ప్రకటన చేసింది.

"సంస్థానంలో కొంతమంది జాగీర్దార్లు, జాగీరు పరిపాలనా నిబంధన లోని అంశాలకు విరుద్ధంగా, భూములను అమ్ముచున్నారనీ, కొంతమంది అమ్మకానికి ప్రయత్నిస్తున్నారనీ ప్రభుత్వదృష్టికి తేబడింది. ఇటువంటి ప్రయత్నాలు, జాగీర్దార్ల, జాగీర్లలో ఉన్న రైతుల ప్రయోజనాలకు విఘాతం కలిగించును. ముందుగా ప్రభుత్వ అనుమతి తీసుకోకుండా యిటువంటిదేమైనా జరిగినచో, అవి చెల్ల నేరవని ప్రభుత్వనిబంధన ముసాయిదాలో వివరించింది. నిబంధన ముసాయిదాలో జాగీరుఅనే పదం సంస్థానాలకూ, పైగాలకు అగ్రహారాలకూ, ముక్తాలకూ, ఉమ్లీలకు వర్తించేటట్లుగా వాడబడింది."

హైద్రాబాద్, ఏప్రిల్ 17: సంఘ విద్రోహులను ఏరివేయటానికి ప్రభుత్వం నగరంలో తీసుకొన్న చర్యల సందర్భంలో దాదాపు 100 మంది అరెస్టు చేయబడిరి.

# కామనువెల్తు సభ: మౌంట్‌బాటెన్‌తో ఢ్వాటు

## ప్రత్యేకం సెలవుపై లండన్‌కు ప్రయాణం

లండను, ఏప్రిలు 17: లండనులో కామనువెల్తు రాజ్యాలసభ జరిగెడి దినములందు మౌంటుబాటెను ప్రభువు లండనులో హాజరైయుండు నిమిత్తము ఆయనకు ప్రత్యేకంగా అనుమతి యివ్వబడెను. మధ్యధరాసముద్ర ప్రాంతమునందు బ్రిటిషు నౌకాదళాధిపత్య వ్యవహారములను మౌంటుబాటెను ప్రభువు ఇప్పుడు నిర్వహించుచున్నాడు. వారు ఆ పనిలో నుండి కొలది దినములు సెలవు తీసికొని లండనుకు రావలెనని కోరబడిరి లండనులో బ్రిటిషు కామనువెల్తు రాజ్యాలసభ జరుగుదినములందు వారు లండనులోనే యుండి ప్రయివేటు సంప్రతింపులకును, పండిత నెహ్రూను ఆయన ఆప్తమిత్రులకు ఆతిథ్య మిచ్చుటకును మౌంటుబాటెను లండనులో నుండును. ఆయన కేవలము తనంతటతాను భారతదేశ క్షేమాభిలాషిగా కామనువెల్తుసభా వ్యవహారముల సందర్భములో నెహ్రూకు సలహాల నిచ్చును. మౌంటుబాటెనుమాత్రము కామనువెల్తుసభలో ఇండియా కు సలహాదారుగాగాని బ్రిటనుకు సలహాదారుగాగాని పాల్గొనడు.

## టెండరు

పంచాయతీ బోర్డు, పొన్నూరు.

### పొన్నూరు పంచాయతీ బోర్డు

తాలూకు మార్కెటు స్థలము ఎత్తుచేయుటకు ఎస్టిమేటు దాఖలా రు. 3500/- పనికి తేదీ. 27-4-1949 సాయంత్రం 4 గంటలవరకు సీలు చేయబడిన టెండర్లు, నిర్ణయించబడిన నమూనాలో, యీదిగువ సంతకము చేయబడిన అధికారిచే, పొన్నూరు పంచాయతీబోర్డు ఆఫీసువద్ద తీసుకొనబడును. నిర్ణయించబడిన నమూనా ఫారముల రు. 1-0-0 చెల్లించి తీసుకొనవచ్చును. టెండరు ధరావతు రు. 250-0-0 చెల్లించవలెను. ఇతర టెండరు షరతులు, వివరములు, పంచాయతీ బోర్డు ఆఫీసు పనిచేయు కాలములో ఉదయము 11 గంటల మొదలు సాయంత్రము 5 గంటలవరకు పొందవచ్చును.

(సం). కె. దశరథరామయ్య బి. ఏ.
14-4-48. కార్యనిర్వాహకాధికారి.



# "ఐర్" రిపబ్లిక్‌లో భారత రాయబారి

## కృష్ణమీనన్ నియామకం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 17: బ్రిటన్‌లో ఇండియన్ హై కమీషనరుగా ఉన్న వి. కె. కృష్ణమీనన్ ఐర్ రిపబ్లిక్‌తో భారత రాయబారిగా నియమించబడెనని భారత ప్రభుత్వ విదేశాంగ కార్యాలయం నేడు ప్రకటించినది. బ్రిటన్‌లో హై కమిషనర్ పదవితోపాటుగా ఈ రాయబారి పదవినికూడా ఆయన నిర్వహించునని ఆ ప్రకటన తెలియజేయుచున్నది.

## నోటీసు

పశ్చిమ గోదావరిజిల్లా బోర్డు ఆఫీసు, ఏలూరు.

ఇందుమూలముగా తెలియపరచున దేమనగా: 17-10-1949-వ తేదిన గవర్నమెంటువారిచే జారీచేయబడిన నెం 4039 రు ఆర్డరులోని 7-వ రూలు ననుసరించి జారీచేయబడిన నోటీసు.

పశ్చిమ గోదావరి జిల్లా తణుకు తాలూకా రేలంగి గ్రామములోని తుమ్మలపల్లి మాణిక్యం బోర్డు మాధ్యమిక పాఠశాల పోషణ నిమిత్తము బోర్డుకు సక్రమించిన యీ దిగువ వివరింపబడిన పశ్చిమ గోదావరి జిల్లా తణుకు తాలూకా తిరుపతిపురము గ్రామములోని పల్లపుభూమి సదరు భూమిని కౌలుదారున కప్పగింత పెట్టిన తేదీ లగాయతు 3 సంవత్సరములవరకు కౌలుకిచ్చుటకుగాను తాడేపల్లిగూడెము హైవేసు అసిస్టెంటు ఇంజనీరుగారివల్ల 10-5-49 తేదిని సాయంకాలము 3 గంటలకు బహిరంగముగా వేలము వేయబడును. వేలము పాట తిరుపతిపురము గ్రామములోని రామాలయము వద్ద జరుగును. వేలములో పాల్గొనదలచినవారు వేలము షరతులు వగైరాలు తాడేపల్లిగూడెము హైవేసు అసిస్టెంటు ఇంజనీరుగారివల్ల 5-5-1949 తేదీ లోపుగా తెలుసుకొనవచ్చును.

Details of Property,
Tirupatipuram Village.

| S. No. | Extent Ac cents | S. No. | Extent Ac.cents |
|---|---|---|---|
| 1. 246/E | 3—84 | 4. 8/2 | 1—10 |
| 2. 246/E | 0—24 | 5. 121/9 | 0—99 |
| 3. 247/2 | 0—74 | 6. 176/3 | 0—30½ |
| | 4—82 | 7. 154/10 | 0—40 |
| | | 8. 154/12 | 0—35 |
| | Ac.cents | 9. 167/10 | 0—72 |
| | 4—82 | 10. 17/2 | 1—06 |
| | 6—46½ | 11. 27/4 | 1—54 |
| మొత్తం | 11—28½ | | 6—46½ |

(Sd.) K Subbaraju,
for Special Officer.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, G. T. Madras